# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపాదకవర్గము

కొలికిచర్ల వెంకటరత్నం
విశ్వనాథ సత్యనారాయణ
అడివి బాపిరాజు
కల్లావజ్ఝల శివశంకరశాస్త్రి



గ్రంథనిర్ణాయక సంఘము

వోరి నరసింహశాస్త్రి
మల్లాది రామకృష్ణశాస్త్రి
కల్లావజ్ఝల శివశంకరశాస్త్రి

సంపుటి ౨ జనవరి ౧౯౩౮ 1938 సంచిక ౩






---

ప్రతిభ సంవత్సరపుచందా రూ 2. విడిసంచిక రూ 0.8.0

జులై. అక్టోబరు. జనవరి. ఏప్రిల్ మాసాలలో ప్రకటన

---

# వ్యత్యాసం

అదృష్టవంతులు మీరు.
వెలుగును ప్రేమిస్తారు; ఇరులను
ద్వేషిస్తారు.

మంచికీ చెడ్డకీ నడుమ
కంచుగోడలున్నాయి మీకు.
మంచి గదిలోనే
సంచరిస్తాయి మీ ఊహలు.
ఇదివరకే ఏర్పడిం దాగది.
అందుకే వడ్డించిన విస్తరి మీ
జీవితం.

నిశ్చల నిశ్చితాలు మీవి.
మంచిని గురించి,
మర్యాద, మప్పితం గురించి,
నడతా, నాణ్యం, విలువల విషయం
నిశ్చల నిశ్చితాలు మీవి.

మీ కన్నుల చూపులు
సరళ రేఖలో.
రేఖ చెదిరితే గొల్లుమనిపోతారు.
రేఖ కవతలివాళ్ళంతా నేరగాళ్ళు.
రేఖను రక్షించడానికే
న్యాయస్థానాలు, రక్షక భటవర్గాలు.
చెరసాలలు, ఉరికొయ్యలు!
రేఖను కాపాడక తీరదు.
అభాగ్యులం మేము,
సరిహద్దులు దొరకని సంధ్యలలో
మా సంచారం.

అన్నీ సమస్యలే. సందేహాలే మాకు.
వెలుగులోని చీకట్లే
ఇరులలోని మిణుగురులే చూస్తాం.
నూరు దోషాలలోని ఒక సుగుణం,
నూరు పుణ్యాలలోని ఒక ఘోరం!
వ్యత్యాసాలూ, వ్యాఘాతాలే
అడుగడుగునా మాకు.
మా వంట మేమే వండుకోవాలి.
ఒకొక్కమారు విస్తరే దొరకదు.
జీవితపు సన్నని సందులకే
ఆకర్షణ మాకు.
మా దృష్టిది వర్తుల మార్గం.
ఆద్యంత రహితం.
సంధ్యా జీవులం. సందేహ భావులం.
ప్రశ్నలే! ప్రశ్నలే!
జవాబులు సంతృప్తి పరచవు.
మాకు గోడలు లేవు.
గోడలను పగులగొట్టడమే మా పని.
అలజడి మా జీవితం.
ఆందోళన మా ఊపిరి.
తిరుగుబాటు మా వేదాంతం.
ముళ్ళూ, రాళ్ళూ, అవాంతరాలెన్ని
ఉన్నా

ముందు దారి మాది.
ఉన్న చోటు చాలును మీకు.
ఇంకా వెనక్కి పోతామంటారు కూడా
మీలో కొందరు.
ముందుకు పోతాం మేము.
ప్రపంచం మావెంట వస్తుంది.
తృప్తిగా చచ్చిపోతారు మీరు.

ప్రపంచం మిమ్మల్ని మరిచిపోతుంది.
అభిప్రాయాల కోసం
బాధలు లక్ష్యపెట్టనివాళ్లు
మాలోకి వస్తారు.
అభిప్రాయాలు మార్చుకొని
సుఖాలు కామించేవాళ్లు
మీలోకి పోతారు.

## అభ్యుదయం

ఏవో
ఏవేవో ఏవేవో
ఘోషలు వినబడుతున్నాయ్
గుండెలు విడిపోతున్నాయ్.

ఎవరో
ఎవరెవరో ఎవరెవరో
తల విరబోసుకు
నగ్నంగా నర్తిస్తున్నారు. భయో
ద్విగ్నంగా వర్తిస్తున్నారు.

అవిగో
అవిగవిగో అవిగవిగో
ఇంకిన
తెగిపోయిన
మరణించిన
క్రొన్నెత్తురు, విపంచికలు, యువయోధులు.
నేడే
ఈనాడే ఈనాడే
జగమంతా బలివితర్ది
నరజాతికి పరివర్తన
నవజీవన శుభసమయం, అభ్యుదయం

౨౦-౨

# నవకవిత

సిందూరం, రక్త చందనం,
బంధూకం, సంధ్యారాగం,
పులిచంపిన లేడినెత్తురూ,
ఎగరేసిన ఎర్రని జెండా,
రుద్రాలిక నయన జ్వాలిక,
కలకత్తా కాళిక నాలుక
కావాలోయ్ నవకవనానికి.

ఘాటెక్కిన గంధకధూమం,
పోటెత్తిన సప్తసముద్రాల్,
రగులుకొనే రాకసిబొగ్గూ,
బుగులుకొనే బుక్కాగుండా,
వికసించిన విద్యుత్తేజం,
చెలరేగిన జన సమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి.

రాంబందుల రెక్కలచప్పుడు,
పొగగొట్టపు భూంకారధ్వని,
అరణ్యమున హరీంద్రగర్జన,
పయోధర ప్రచండఘోషం,
ఖడ్గమృగోదగ్ర విరావం,
ఝంఝానిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి.

కదలేదీ, కదలించేదీ,
మారేదీ, మారించేదీ,
పాడేదీ, పాడించేదీ,
పెను నిద్దుర వదలించేదీ,
మునుముందుకు సాగించేదీ,
పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ
కావాలోయ్ నవకవనానికి.

శ్రీరంగం శ్రీనివాసరావు

# జయదేవుడు

## రాయప్రోలు సుబ్రహ్మణ్యం

[౧]

జయదేవుడు ఉత్కలదేశంలో పుట్టినవాడా, వంగదేశంలోజన్మించినవాడా అని మొదటలోనే సంశయంకలుగుతుంది. కొంతమంది ఇతనిని కేవలం ఉత్కలుణ్ణిగానే భావిస్తున్నారు. బిందుబిల్వ సముద్రసంభవరోహిణీ రమణేన అని కవే ఒకఅష్టపదిచివరలో చెప్పుకున్నాడు. ఈబిందు బిల్వగ్రామం జగన్నాథ క్షేత్రమునకు ఇంచుమించుగా ఇరవై మైళ్ళ దూరంలోవుంది. గీతగోవిందమునకు ఆంధ్ర వ్యాఖ్యానం రచించిన ఉత్పలనరసింహాచార్యులుగారు ఉత్కలదేశంలో దనే అన్నారు. పండితపరంపరలోకూడా జయదేవుడు ఔత్కలీయుడనే. శ్రీ శివశంకర శాస్త్రిగారు జయదేవుడు బిందుబిల్వంలో జన్మించినవాడనీ, ప్రకృతం వంగ దేశమనే భూభాగంలో ఆనాడు నివాసంచేసే వాడనీ 'పద్మావతీ...'నాటికలో వ్రాశారు. కలకత్తా సర్వకళాశాలలో ఓథ్ర పండితులయిన వినాయక మిశ్రమహాశయునకు ఈవిషయమై శాస్త్రిగారు వుత్తరంరాస్తే ఆయన ఈసమాధానం యిచ్చారు.

"జయదేవుడు ఉత్కలదేశంలోనే పుట్టినట్టు నిస్సందేహంగా చెప్పటానికి తగినంత ఆధారం లేదనవలసివస్తుంది. అయితే ప్రతాపరుద్రమహారాజు పదహారో శతాబ్దిలో రాజ్యంచేశాడు. ఆయన జగన్నాథ దేవాలయంలో దేవదాసీలు గీతగోవిందంతప్పమరేదీపాడగూడదని ఆజ్ఞాపించినట్లు ఒకశాసనంలో కనపడుతోంది. మహారాష్ట్రదేశంలో ఒకానొక వైష్ణవతెగవారిసంప్రదాయంలో జయదేవుడు ఉత్కలదేశంలో జన్మించినవాడనే ఉన్నది. ఇప్పటికీ ప్రతి సంవత్సరమూ జయదేవగౌరవార్థం వేదులిగ్రామంలో 'మేలా' (ఉత్సవం) జరుగుతున్నది. కాబట్టి వంగదేశవిద్వాంసులు ఆ గ్రామమే కేందుబిల్వ మంటున్నారు.

అయితే ఇతర ఉత్కలగ్రంథకర్తలు జయదేవుడు తమవాడేఅని అంటున్నారు. బిందుబిల్వానికి తిందుబిల్వమనీ, కేందుబిల్వమనీ, పాఠాంతరాలు గీతగోవిందంలో కనపడుతున్నాయి.

వీరభూమికి దక్షిణంగా పదిక్రోసులదూరాన అజయనదికి ఉత్తరతీరాన కేందులిగ్రామం వున్నది. అజయ భాగల్పూరుజిల్లా దక్షిణాంశలో పుట్టి 'సంతాల్' పరగణాకు దక్షిణాంశలో ప్రవహించి తరవాత వీరభూమి వర్ధమాన జిల్లాలమధ్యగా తూర్పుగా వెళ్లి కాటోజార్ దగ్గర భాగీరథిలో పడుతుంది.

కేందులికి కేందుబిల్వమని పాఠాంతరం. వీర భూమిజిల్లాకు ప్రధాన పట్టణమయిన 'సురి'కి ఇది రమారమి తొమ్మిదికోసుల దూరాన వున్నది. ఈగ్రామంలో రాధాదామోదర విగ్రహాలు పూర్వులు ప్రతిష్ఠించారు. వైష్ణవులకు కేందు బిల్వము పవిత్రక్షేత్రము.

జయదేవునితండ్రి భోజదేవుడు. ఈయన ఐదు కాన్యకుబ్జశాఖల్లో ఒకశాఖకు చెందిన వాడు. జయదేవునితల్లి వామాదేవి. హరిదాస్ హీరాచంద్ గీతగోవింద టీకలో ఆమెపేరు రాధాదేవి అని వ్రాసినాడు. మన దేశంలో ముద్రితమయిన గీతగోవింద ప్రతులలో రామాదేవిఅని కనపడుతుంది. ఈరెండింటికి తగిన ఆధారాలు లేవు.

వంగదేశాధిపతి ఆదిశూరుడు స్వదేశ బ్రాహ్మణులు భ్రష్టులుగావుండటం చూచి కాన్యకుబ్జాధిపతి వీరసింహుని వేడుకొని ఉత్తమ బ్రాహ్మణులను ఐదుగురిని తన రాజధానికి పిలిపించుకున్నాడు, పుత్రకామేష్టిచేయించటానికో, అనావృష్టి నివారణార్థమో తెలియదు. క్షితీశవంశావళి అనే గ్రంథంలో ఈప్రకారంగా వున్నది. "ఆదిశూరప్రభుమేడమీద గెద్ద వాలిందిట. అమంగళం కలుగుతుందని శంకించి మంత్రబలంచేత గద్దనుపట్టించి దానిమాంసం హోమంచెయ్యటానికి రాజు సంకల్పించి బ్రాహ్మణులను పిలపించాడు.

భట్టనారాయణో దక్షో
వేదగర్భో ఒథ ఛాందడః

అర్థశ్రీ హర్ష నామా చ
కాన్యకుబ్జసమాగతాః

ఆదిశూరో పంచబ్రాహ్మణా నానయామాస" ఇలావచ్చిన ఐదుబ్రాహ్మణకుటుంబాలలో ఒకదానికి జయదేవుడు చెందినవాడని ప్రతీతి.

జయదేవుని కాలమునుగురించి వివిధ మతాలున్నాయి. శ్రీసనాతన గోస్వామివారు లక్ష్మణసేనమహారాజూ, జయదేవుడూ సమకాలికులని వ్రాశారు. రాజు కాలాన్ని గురించి అభిప్రాయభేదాలున్నవి. రాజేంద్రలాల్ మైత్రా మహాశయుడు లక్ష్మణసేనుడు క్రీ. శ. 1101—1121 ప్రాంతంవాడని వూహించినాడు. మిథిలలో లక్ష్మణసేనాబ్దము ప్రచారంలోవున్నది. దానిచిహ్నము గల సంవత్సరము మాఘమాసప్రతిపత్తితో ప్రారంభం.

లక్ష్మణసేనుడు కీ.శ. 1107లో గౌడదేశాన్ని పరిపాలించినాడని రాఖాలదాస్ బెనర్జీ... 

లక్ష్మణసేనమహారాజ సభామండపద్వార శిలా ఫలకం మీద-

'గోవర్ధన శ్చ శరణో
జయదేవ ఉమాపతిః
కవి రాజశ్చ రత్నాని
సమితౌ లక్ష్మణస్యచ'

అనే శ్లోకం వున్నదని సంగీత సారగ్రంథంలో నిబద్ధమయింది. గీత గోవింద కావ్యంలో ఉమాపతి ధరుడు, శరణుడు, గోవర్ధనాచార్యుడు, ధోయీ, జయదేవుడు.. వీరి పేర్లు కనపడుతున్నాయి. జయదేవుడు ఆరాజాస్థానంలో ఉండకపోతే ఆకవులపేర్లు ఉదాహరించటం సంభవించదు.

గీతగోవింద వ్యాఖ్యలలో శ్రీగంగానామక వ్యాఖ్యరచించిన కృష్ణదత్తు, ఉమాపతి ధరుడు గౌడలక్ష్మణసేనుని అమాత్యుడని వ్రాశాడు. కాబట్టి జయదేవలక్ష్మణసేనులు సమకాలికులని విశ్వసించవచ్చును.

అయితే జయదేవచరిత్రలో ఈ సంగతు లేవీలేవు. దొంగలు అతనిఆస్తియావత్తూ అపహరిస్తే అతను ఎవరో రాజుదగ్గరకి చేరాడనిమాత్రం వుంది.

చాంద్‌బర్ దాయీరచించిన పృథ్వీరాజ రాసోఅనే గ్రంథంలో

జయదేవ అఠంకవీ కబ్బిరాయం
జిన్హై కేవల్ కీర్తిగోవిందగాయం

అన్నాడు. దృషద్వతీ నదీతీరాన క్రీ. శ. 1193 లో షహాబుద్దీన్‌గోరితో పృథ్వీరాజు యుద్ధముచేసి మృతినొందినాడు. చాంద్‌భట్టుకు జయదేవుడు పూర్వుడయివుండాలి. గీత గోవిందమును Latin భాషలోకి అనువదించిన Lassen మహాశయుడు జయదేవ కవి క్రీ.శ. 1150 ప్రాంతంవాడనివ్రాశాడు. కొందరి మతప్రకారం జయదేవుడు 14,15, 16 శతాబ్దాలవరకు ఇవతలికి వస్తాడు. మేవాడ ప్రభువు కుంభరాణా గీత గోవిందానికి వ్యాఖ్యరాశాడు. ఈయన 1419 లో సింహాసనమెక్కినాడు. కాబట్టి జయదేవుడు ఆప్రాంతంవాడు కావచ్చును.

జయదేవుడు రామానందుని శిష్యుడని కొందరిమతం. రామానందుడు 14వ శతాబ్ది చివరవాడు. ఆయనను భగవద్రామానుజాచార్యులవారి శిష్యుడు అని కొంతమంది అన్నారు. శిష్యపరంపరలో రామానుజుని శిష్యుడు దేవానందుడు; అతని శిష్యుడు హరినందుడు; అతని శిష్యుడు రాఘవానందుడు; అతని శిష్యుడు రామానందుడు. దీనినిబట్టి జయదేవుడు 14 వ శతాబ్ది చివరకు రావాలి. భక్తిమాలలోవున్న పరంపరకు దీనికి వ్యత్యాసం కనపడుతోంది. దాని ప్రకారం మొదట రామానుజులు, తరువాత దేవాచార్యులు, రాఘవానందుడు, రామానందుడు వస్తారు. కబీరు రామానందుని శిష్యుడు. అతను 15వ శతాబ్దివాడు. Cunningham రామానందుని శిష్యుడు పిపాజీకాలం నిరూపణచేస్తూ 14 వ శతాబ్ది చివరవాడని తేల్చాడు. దీన్నిబట్టి రామానందుడు కూడా అప్పటివాడే కావాలి. కాబట్టి జయదేవుడు కూడాయించుమించు

ఆప్రాంతంవాడే కావాలి.

Elephantstone జయదేవకవి 14వశతాబ్ది వాడని రాశాడు.

వైష్ణవదాసు సంగ్రహించిన పదకల్పతరు గ్రంథంలో జయదేవ విద్యాపతి ప్రభృతుల కీర్తనలు శ్రీచైతన్యస్వామివారు విన్నట్లు వ్రాసినాడు. జయదేవుడు విద్యాపతికంటె ప్రాచీనుడు. హృదిబిసలతాహారో అనే జయదేవ శ్లోకాన్ని విద్యాపతి సంపూర్ణంగా ఒకగీతికలో అనుకరించాడు. విద్యాపతి 1370 ప్రాంతంలోవాడని రాజకృష్ణ ముఖర్జీలిఖించినాడు. ఈ వాదాలన్నింటిని పరిశీలించిచూస్తే జయదేవుడు 12 వ శతాబ్ది ప్రారంభంలోవాడని అంగీకరించవచ్చును.

[౨]

జయదేవుని బాల్యంసంగతి సరిగా తెలియదు. గీతగోవింద కారుడు విద్యార్థిదశలో గురువు దగ్గర పక్షంమార్చి మరోపక్షంలో చదువుతూ వుండటంచేత అతనికి పక్షధర మిశ్రుడనేపేరు వచ్చిందని హరిదాస్ హీరాచంద్ వ్రాశాడు. ఇది గీతగోవిందకారుని బిరుదు కాదు. ఈ బిరుదం ప్రసన్న రాఘవనాటక కర్తఅయిన మరొకజయదేవుడికివర్తిస్తుంది. వీరిద్దరు భిన్నవ్యక్తులని సాంఖ్యప్రవచన భాష్యభూమికలో Hall మహాశయుడు నిర్ధారణచేశాడు.

ప్రసన్నరాఘవకర్తప్రస్తావనలో "నన్వాయుం ప్రమాణ ప్రవీణోపి శూయతే తదిహ చంద్రికా చండాతపయోరివకవితా తార్కికత్వయోః" అని వ్రాసుకున్నాడు. చింతామణ్యాలోకము (శబ్దఖండము) అనేన్యాయగ్రంథటీక పక్షధరమిశ్రకృతమని ప్రసిద్ధి. "యద్ధపత్యుపాధ్యాయచ్చాభత్రిః పక్షరమిశ్రః చింతామణేరాలోకకారః" అనిశబ్దకల్పద్రుమ ద్వితీయఖండంలో వున్నది. అందుచేత ప్రసన్నరాఘవకర్తకు ఈబిరుదు వుండటం ఉచితం. గీతగోవింద కారుడు న్యాయగ్రంథం వ్రాసినట్లు ఎక్కడా కనపడటం లేదు.

జయదేవుడు పరివ్రాజకవృత్తి అవలంబించాడుట. అయనకి కొంతమంది శిష్యులు కూడా వున్నారట. ఆయన జాతిభేదాలు తీసివేసి ధర్మ ప్రచారం చేసినప్పటికీ మతకర్తగా పేరు నిలవక కవిగా మాత్రం నిలిచింది.

జయదేవుని వివాహవిషయమై కొన్ని విచిత్ర ప్రవాదాలున్నాయి. బహుకాలంసంతానం లేని ఒకానొక బ్రాహ్మణుడు శ్రీజగన్నాథ స్వామి నారాధిస్తే పుత్రికకలిగింది. బిడ్డకు పద్మావతి అని పేరుపెట్టి వివాహయోగ్యత వచ్చాక స్వామిపేర(దేవదాసిగా) విడిచిపెట్టవలెనని నిశ్చయించుకొని బ్రాహ్మణుడు పురుషోత్తమక్షేత్రానికి వెడుతున్నాడు. దారిలో జగన్నాథస్వామి గోచరించి "నాభక్తుడు జయదేవుడు గృహపరిత్యాగం చేసి చెట్టుకింద నివసిస్తున్నాడు. అతనికి నీబిడ్డనియ్యి" అని ఆదేశించాడు. బ్రాహ్మణుడు కుమా

ర్తతో దగ్గరకు వెళ్లి ప్రార్థించినా, యతి రూపంలో వున్న జయదేవుడు తనకు స్త్రీ అక్కరలేదని నిరాకరించాడు. అయినప్పటికీ పద్మావతి నక్కడ విడిచిపెట్టి తండ్రి వెళ్లి పోయాడు. జయదేవుడికి ఏమీతోచక తికమకపడుతుంటే పద్మావతి పాదసేవకురాలుగా వుంటానని పట్టుపట్టే సరికి ఆమెను యింటికి తీసుకు వెళ్లి యథావిధిగా వివాహమాడాడు. ఆరోజుల్లో తన ఉపాస్య మూర్తి అయిన నారాయణ విగ్రహం ఇంట్లో ప్రతిష్ట చేశాడు.

ఆరాధ్య దేవతకు కైంకర్యం నిమిత్తమయి ధనసంపాదనకోసం బయలుదేరి బృందావనం జయపురం మొదలయిన ప్రదేశాలకు వెళ్లాడు. చోరులు అతని సర్వస్వం అపహరించి కాళ్ళూ చేతులూ విరగకొట్టారు. ఎవరో ప్రభువు మార్గమధ్యంలో అతన్ని చూసి రాజధానికి తీసుకుపోయి స్వాస్థ్యం కలిగించాడు. చోరులు తిరిగి పరివ్రాజక వేషాలు ధరించి కొన్నాళ్ళకు ఆ రాజధానికే వచ్చారు. జయదేవుడు వాళ్ళను గుర్తించి కూడా వాళ్ళకు శాస్తి చేయించలేదు. తరువాత అతని భార్యను తెచ్చుకొని అక్కడే కాపరం చేస్తుండేవాడు. తరువాత కొన్నాళ్ళకు భర్త చనిపోయినాడనే అలీకవార్త విని పద్మావతి ఆత్మహత్య చేసుకున్నదనీ, కృష్ణ నామం ఆమె చెవులో ఉచ్చరించి భర్త ఆమెను బతికించుకున్నాడనీ భక్తమాలలో కనపడుతుంది.

పద్మావతి ఆయన భార్య కాదనీ, ఉంపుడుకత్తె అనీ ఒకరిద్దరన్నారు. ఆమె జగన్నాథాలయంలో దేవదాసి అనీ, జయదేవుడు ఆమెను చూచి ముగ్ధుడయి తీసుకొనిపోయి తన యింట్లో పెట్టుకోవడమే కాకుండా సిగ్గువిడిచి తానుపద్మావతీచరణ చారణ చక్రవర్తినని రాసుకొన్నాడనీ దినేశచంద్రసేను ఒక గ్రంథంలో లిఖించినాడు. ఇది తీవ్రమయిన వూహ. ఒకవేళ ఆమెను కవి వివాహం చేసుకోకపోయినా అంత అనురాగంతో ఆమె విషయమై గీతగోవిందంలో ఉల్లేఖించటంచేత భార్యాత్వ గౌరవం ఆమెకు సిద్ధమే అయినది. లోకంలో ఆమెమహాపతివ్రత అని ప్రతీతి వ్యవహారములువుండటంచేత మా వంటివారికి గౌరవార్హురాలు.

దంపతులు కొంతకాలానికి గీత గోవిందం పాడుతూ దేశసంచారం చేసేవారట, శ్రీ గిడుగు రామమూర్తిపంతులు గారన్నారు. జయదేవుడు పద్దెనిమిదికోసుల దూరంలో వున్న గంగానదికి రోజూ స్నానానికి వెళ్ళి వచ్చేవాడట. నదీదేవత అతని కష్టంచూసి ప్రసన్నురాలయి "నీవు నాదగ్గరకు రోజూ రాలేవు. నేనే నీసమీపంలోకి వస్తాను" అని కేందులి సమీపానికి వెళ్ళిందిట. ఈకింవదంతి Wilson మహాశయుడు కూడా విన్నాడట. నిజానికి కేందులి అజయనదికి ఉత్తరతీరాన వున్నది. అజయ భాగీరథికి వుపనది.

జయదేవునికి సంతానం కలిగినట్లు ఎక్కడా ఏ గ్రంధంలోనూ కనపడటం లేదు. ఆయన ఎప్పుడు ఇహాలిల చాలించాడో కూడా తెలియదు. కేందులీ గ్రామసమాజస్థలంలో ఆయన సమాధివున్నది. పరమభాగవతు లయిన వైష్ణవులు మృతిపొందిన తరువాత సమాధి కడతారు. జయదేవునిసమాధి పొద రిళ్ల మధ్య చాలా అందంగా వుంటుందిట. వైష్ణవులు యిప్పటికీ ఆగ్రామంలో జయ దేవమేళా చేస్తారు, ఉత్తరాయణసంక్రాంతికి.

## [3]

గీతగోవిందం కాక రతిమంజరి, కారకవాదం అనే గ్రంధాలు కూడా జయదేవుడు రాసి నట్లు వాడుక.

పురాతత్త్వవేత్త లెవరూ ఈవిషయం అంగీ కరించలేదు.

ఒక జయదేవుడు చంద్రాలోకం అనే అలం కార గ్రంధం రచించినాడు.

"ఇతి శ్రీ పీయూషవర్ష పండిత శ్రీ జయ దేవ విరచితే చంద్రాలోకాలంకారే అభిధా స్వరూపాభిధానోనామదశమోమయూఖః"

అని చంద్రాలోక సమాప్తి వాక్యం. ప్రసన్న రాఘవకారుడు విదర్భనగరవాసి అయిన మహాదేవుని పుత్రుణ్ణని చెప్పుకు న్నాడు. చంద్రాలోకకారుడు కూడా అలాగే చెప్పుకున్నాడు.

"పీయూషవర్ష ప్రభవం
చంద్రాలోక మనోహరమ్
సుధానిధాన మాసాద్య
శ్రియధ్వం విబుధాముదమ్.
జయంతి యాయక శ్రీమా
స్మహాదేవాంగ జన్మనః
సూక్తం పీయూషవర్షస్య
జయదేవకి వేర్గిరః."

కాబట్టి కేందుబిల్వములో భోజదేవ పుత్రుడయిన జయదేవుడు ఇతను కాదని తేలుతుంది.

## [4]

విక్రమమహారాజుసభలో గీతగోవిందం పాడే వారట. మనదేశచరిత్రలో అనేకమంది విక్రమాదిత్యు లున్నారు. అయితే వీర భూమిలో మంగళకోట్ పరగణాలో ఉజ్జ యినీ అనే ప్రదేశం ఒకటివుంది. మామూ లుగా దాన్ని ఉజానీ అంటారు. ముకుంద రామకవి కవికంకణచండీ గ్రంధంలో ఉజానీ నగరంలో విక్రమకేసరి అనేరాజు వున్నట్టు రాశాడు. కాబట్టి ఈవిక్రముడు ఆయన కావడానికి అవకాశం వుంది.

కళింగదేశంలో కృష్ణాష్టమినాడు కర్ణాటక గాయకులు గీతగోవిందం పాడతారు. వల్ల భాచార్యులవారి శిష్యులు కార్తిక ఏకాదశి నాడు గీత గోవిందం పఠిస్తారట. జైనరాజు శ్రీహర్షుడు క్రమసరోవర భ్రమణ సమ యంలో గీత గోవిందం పాడించేవారు.

జయదేవుడు కావ్యం పూర్తి చేయగానే నీలాచల ప్రభువు (ఉత్కల జగన్నాథరాజు) ఈర్ష్యాపరుడయి తానొక గీత గోవిందం రాశాడుట. జయదేవగ్రంథమే ప్రశస్తమని నమ్మిన విద్వాంసులు రాజుకు నిజం చెప్పటానికి సంశయించి రెండు పుస్తకాలు శ్రీ స్వామివారి సన్నిధానంలో వుంచి ఆలయం తలుపులు మూసివేశారుట. మర్నాడు ఉదయం చూసేసరికి జయదేవుడి గ్రంథం స్వామి వక్షస్థలంమీద వున్నది, రాజ పుస్తకం దూరంగాగిరాటవేసినట్లువున్నదిట. నీలాచల ప్రభువు భరించలేక సముద్రంలో పడ బోయాడట, శ్రీ స్వామికి రాజుమీద అనుగ్రహం కలిగి అతని గ్రంథాన్ని దగ్గరికి తీసుకున్నాడట. ఇటువంటి కింవదంతులు చాలావున్నాయి.

గీత గోవింద రచననుబట్టి అందులో అష్టపదుల మాత్రాఛందస్సును బట్టి దేశీయ భాషలో పాటలకు సమీపముగావున్నది అని Pischel వ్రాశాడు. మంజుందారు గీత గోవింద అనువాద భూమిక ఇలావ్రాసినాడు: అష్టపదులు మొదట ప్రాకృత భాషలో రచింపబడ్డవి. పశ్చిమఅపభ్రంశభాషలోగాని, ప్రాచ్యఅపభ్రంశలోగాని ప్రాచీన వంగభాషలోగాని రచితమయినట్లు కొందరు విద్వాంసులు సంశయించారు.

అవహట్టపద్యములు- అష్టపదులకు తుల్యమయినవి ప్రాకృతపింగళములో ఐదుస్థానములలో కనుపడుతున్నాయి.

ఈగీతికలు మొదట ప్రాకృతములో వుండేవనీ, ప్రాచీన Italian భాషను కొంచం సవరించి Latin లోకిమార్చినట్టేసంస్కృతంలోకి మార్చారనీ కొందరు విద్వాంసులు అభిప్రాయపడుతున్నారు. గీతగోవిందం మొదట · ఉపక్రమోపసంహారాలతో కూడిన నిబద్ధకావ్యముకాదనీ, అప్పుడప్పుడు రచించిన అష్టపదులు ఒకక్రమంలో ఏర్పాటుచేసి కథా సంధికోసమయి సందర్భోచితమయిన పద్యాలు రచింపబడ్డవనీ చివరకు ఇవన్నీ కలసి కావ్యరూపం ధరించినవనీ మరి కొందరి అభిప్రాయము. ఈ వూహాలన్నీ ఆధారరహితమయిన వని సునీత్ కుమార్ చటర్జీగారి అభిప్రాయము. జయదేవుడు రాఢదేశస్థుడని ఆయన ఆశయము.

ఇప్పుడు గీత గోవిందం ఆద్యంతాలు పరిశీలిస్తే కావ్యం సుసంబద్ధమైనదనీ, గ్రంథానికి ఏకవాక్య వున్నదనీ స్పష్టముగ గోచరిస్తుంది. రస చర్చచేసి చూచినట్టయితే కావ్యజటిలత, ఏకత వ్యక్తమవుతుంది.

అలంకారిక లక్షణప్రకారం గీతగోవిందానికి మహా కావ్యత్వం ఉపపన్న మవుతుందా కాదా అనేవిషయము దానికి సంబంధించిన యితర విషయములు శ్రీ శివశంకర శాస్త్రి గారు పద్మావతీ చరణచారణ చక్రవర్తి అనే గ్రంథంలో మృదువుగానిరూపించారు. ఈ మహాకృతిని బహు. కాలం క్రిందట Sir William Jones, Sir Edwin Arnold ఇంగ్లీషు లోకి Lassen లాటిన్

లోకీ, Ruekert జర్మన్ భాషలోకీ అనువదించారు. ప్రపంచంలో వుత్తమ భాషల్లోకి అనువదింపబడ్డది. భారత దేశ భాషలెన్నింటిలోకో భాషాంతరీకరించారు. కాని మన దురదృష్టమేమోకాని సంపూర్ణమయిన అనువాదంలేదు. వెనకటి కవులలో గీతగోవిందాన్ని అనుసరించి శృంగార రాధామాధవ కావ్యము ముద్దుపళని కొన్ని గీతికలూ; కోమాండూరు కృష్ణమాచార్య కవి ఒకఅష్టపదికి పద్యానువాదమూ ఈప్రకారంగా కొన్ని భాగాలే తెలుగులోకి వచ్చాయి. సంగీత సాహిత్యములు రెండింటిలోను గట్టిచేతులయినవారు వాగ్గేయకారకులూ అయిన ఆదిభట్ల నారాయణ దాసుగారు కాని హరినాగభూషణంగారు కాని మరి ప్రజ్ఞావంతు లెవరైనా కాని గీతగోవిందాన్ని సక్రమంగా ఆంధ్రీకరిస్తే ఆంధ్ర వాఙ్మయానికి అలంకార మవుతుంది. కవులకు భక్తులకు రసికులకు గాయకులకు ఆనంద దాయక మవుతుంది.

# వెన్నెల

**బొడ్డు బాపిరాజు**

సితవారిద స్నిగ్ధసికతాతలశ్రేణి కదలిన దివిజగంగా స్రవంతి
దినవిరావశాంత దిగ్దిగంతస్సీమ నలమిన కుముదాట్టహాసరేఖ
మలయాచలాయాత మధురమారుతవీచి నుబికిన తారకావ్యబలరక్తి
నవవయో విభవసుందర శరన్మృదుమూర్తి యులదిన హరిచందనాభిచర్చ
ప్రకృతి దేవతాస్థాన దివ్యాంగణమున
యామినీకాంత చిలుకు హిమాంబువృష్టి
విరిసి, యమృతాంశు డను గని పెటిలిపడిన
ఒకయమేయరోచిః ప్రచారమో యిదెల్ల!

అలకలొత్తుచు కూర్మిలొలుక పాలిచ్చి పెంచెడితల్లి మెత్తని యొడియువోలె
వలపారు వాలుచూపులమేన పులకలూరించు నెచ్చెలి కౌగిలింపువోలె
ఎదబవ్వళించి ముద్దాడవ ముచ్చటలాడు చంటిబిడ్డ విరాళియంటువోలె
మనసు సేతయు నొక్కమాదిరి కలిసిన సంగాతి నవ్వైన జాబువోలె
తనకొరకు నిండు తమకాన దవ్వునుండి
చూడవచ్చిన చుట్టము చూపువోలె,
చలువలొలయ, నింపెసగ, తీపులూరగ, తల
పలర, తమిదేల తరిపి వెన్నెలలు గురిసె.

పొదరిల్లు చంగునవదలి ముందడుగిడు శశిబాల నతుల హాసాదునుడువ
చిరుగాలి కదలిక చెదరుగుప్పిటను కేరాణితావులు నజరానవెట్ట
తలపురెక్కల క్రొత్తకలలు చూచుచుబోవు కవిరాజు కైవారకములు సలువ
కడుపారవెన్నెల యుడుకుపాయసమాని యెలచకోరమ్ము మంగళముపాడ
చిందునగవుల పరిచర్య లందుకొనుచు
హాయి నడిమింటిగద్దె కొల్వయిన చల్ల
నయ్య, రాజచంద్రముని తియ్యని యశమ్ము
పొంగి పారలెత్తె నీ విశ్వభువనవీథి.

జలజాంగనా విభాస్వంత సీమంతదేశముల చక్కనిముత్తె సరులుపేర్చి
నారికేళమహీరుహ హారూఢ పత్త్రాగ్రసీమల వెండిమొలాము సేసి
సరస సస్య శ్రీ విశాలవసుంధరా ప్రమదకు సరిగదువ్వాలువ గట్టి
స్తిమిత ప్రవాహావార్ద్ర్యమలాపగా మృదులోర్మిశయ్యల తేలి యోలలాడి
వివిధరుచి విభ్రమప్రియ వ్యవసితములు
లలితలాస్యాభినయవృత్తములను మెరసి
భూనభోంతరాళముల సమాన తేజ
ములను ముంచెత్తె వెలది వెన్నెలల యలలు.

తలిరాకు పరదాలు తప్పించుకొనివచ్చి మొగ్గకన్నెల వ్రతమ్ములను చెరప
ఆకులగుమి సందులందుండి దిగి పుల్గుజంటల వలపుముచ్చట్లు తెలియ
లేబచ్చిక బయళ్లలో బడి యాడెడి లేడిపిల్లల జట్టుతోడ తిరుగ
ఇంటితిన్నెయల పైకెక్కి పిల్లలతో నవ్వాలకథ కడ్డుసవాళ్లు వేయ

నడి బజారుల నీదుకాంద్ర గలసికొని
యోలి నువ్వు పల్లీల పట్టీలు కొట్టి
పొంగి పడుచుండె కొంటికోణంగి, దుడుకు
వెన్నెల వయస్సు మూమ్మర మెన్నగాదు!

# సామిధేని

శ్రీరంగం నారాయణ బాబు

రక్త పతాకం
శక్తి నాలుక
అగ్ని కిరీటం
ఆకాశమున
మునిమాపు
కేకలువేస్తూ
పిలిచింది ;

కాలంనాగు
వినువీథుల్లో
వెన్నెలపడగ
విప్పింది ;

శారదరాత్రి
శంకరుఫాలం
బూదిపవిత్రిత
బూరాడూదింది
దేహంవీడి
దేశంవీడవు
దిక్కుల ఉరి
కొయ్యలనుండి

దేశనాయకుల
ప్రాణాలు
మూగగాలులు
మూలుగుతువీచాయి ;

హంతకు చేతినికత్తులు
వింతహృదయమున భావాలు
శిరసున రతనము
గళమున విషమ్మూ
కలమ్మకొసలో
కాటుకమబ్బులు
కాగితమే కంపించింది
పాటే
గ్రహపాటు ?

సూరన అడిదాన్ని
తిక్కన ఖడ్గాన్ని
పేలినబిజాపూరు
ఫిరంగిగుండు
నాగుండె !

'రుధిరజ్యోతి' నుండి

# శ్రీ శంకుకరసవాదము

జమ్మలమడక మాధవరామ శర్మ

శ్రీ శంకుకుడు మహాతార్కికమణి అయి నప్పటికీ తనలోని ఆత్మధర్మాలు విలోపం పొందకపోవటమును వ్యక్తం చేసుకొన్నాడు. ఇతడు రసానికి అనుమేయపద్ధతిని నిరూపణం చేసాడు. ఇతని అభిప్రాయమును ఈ క్రిందివిధముగా రసయితలు గ్రహించ టానికి వీలున్నది.

ఒక నిర్ణీత తననిశ్చయాన్ని వ్యక్తం చేయ టానికి ముందుగా ఇతరుల వాదాలదౌర్బ ల్యమును నిరూపించటము సామాన్యంగా శాస్త్రీయ గ్రంథాలలో కనిపించుతుంది. శ్రీశంకుకుడు భట్టలొల్లటుని మతాన్ని ఖండించుతాడు. సమర్థనటుడు చక్కగా అభి నయించినపుడు స్థాయిభావము అవగమ్య మానం అవుతుంది. ఇట్లా గమ్యమయ్యే భావానికి అవగమకాలు అవశ్యంగా ఉండి తీరవలసిందే. విభావాదులు స్థాయిని అవగ మింపచేస్తవి. ఇవి లేకపోతే స్థాయ్యవగతి ఉపపన్నం కాదు. ధూమము అవగ మకము. అది లేకపోతే పర్వతప్రదేశంలో అగ్ని ఎట్లా అనుమితం అవుతుంది ? అందు వలన అవగవకభావనిర్వచనం అవసరా పేక్షితం. భరతుడు తననాట్యశాస్త్రంలో ముందుగా రసనిర్వచనం చేసాడు గాని భావస్వరూప ప్రతిపాదనం చేయలేదు. ఇంకా స్థాయిభావాలు స్వయంగా విభా వాలవలన ఉత్పన్నము లవుతవి. అనుభా వాలు వాటిని సూచించుతవి. వ్యభిచారులు పరిపోషమును సంపాదించుతవి. అందువలన స్థాయి క్రమంగా ఉత్పాద్యోత్పాదక భా వము - గమ్యగమకభావము- పోష్యపోషక భావము అనే సంబంధాలతో కూడుకొని రసీభావము పొందుతుంది—అనే లొల్లట వాదము ఉచితంగా లేదు. ఇది భరతమునికి సమ్మతంకాదు.

ఈతత్వమే భరతుడికి ఇష్టమైతే ముందుగా స్థాయిభావాలనువిభావాలను చెప్పవలసింది. వాటినే న్యాయానుసారంగా ఉద్దేశించాలి. ప్రథమంలో వాటికే లక్షణం నిరూపిం చాలి. కాని భరతుడు ఆవిధంగా చేయలేదు. ముందుగా రసాన్నే ఉద్దేశించి లక్షణం చెప్పాడు. తరువాత రసాలకు విభావాదుల్ని నిరూపించాడు. అంతతో తృప్తిపడక స్థాయిస్వరూపకథనం చేశాడు- లొల్లటవా దాన్ని అనుసరించితే రసవిజ్ఞానానికి ముం దుగాభావవిభావాదులను తెలుసుకోవటంఅవ సరం. భరతుడికీవాదం ఇష్టమయితే మళ్లా స్థాయి స్వరూపకథనం అనావశ్యకం. అందు

వలన భరతుని ప్రణాళికను బాగాఅవగతం చేసుకొంటే లొల్లటవాదాన్ని అవదాతం అనలేము. భరతుడు ఆయారసస్వరూప కథ నావసరంలో నిశ్చయించిన విషయాలను స్థాయికథన సమయంలో అభిన్నార్థకము లుగా భావించిభంగ్యంతరంగా నిరూపిం చాడు. సామాన్యస్థాయ్యుత్పత్తిలో కార ణము లయినవాటిని పరిపోషం పొందిన స్థాయ్యుత్పత్తికారణములనుగా చెప్పటం అవసరం కాదు. స్థాయి ఉపచితం అయితేనే కాని రసం కాదు. అట్లాంటిరసానికి ఉత్పత్తి కారణాలను చెప్పటంలో ప్రయోజనం లేదు. రసావస్థితిని చెప్పేసమయంలో స్థాయి కారణ స్వరూపం సిద్ధప్రాయమే. కాబట్టి మళ్ళా కారణతాఖ్యాపనం అసంగతం అవు తుంది. ఇంకా ఒక అనుపపత్తి లొల్లట మతంలో ఉన్నది. అనుపచితస్థాయి భావ మనీ ఉపచితస్థాయి రస మనీ లొల్లటభావ ము. ఈవిధంగా అయితే ఒక్కొక్కస్థాయి అనంతస్వరూపాలను పొందవలసి వస్తుంది. స్థాయిభావానికి సంప్రాప్త మయ్యే ఉపచి తిలో తారతమ్యం సహజం. ఉపచితివిశే షాన్నిబట్టి స్థాయికూడా అనేకవిశేషవిశిష్టం కావలసివస్తుంది. మంద- మందతర-మంద తమవిశేషాలు, మధ్యస్థ-మధ్యస్థతర-మధ్యస్థ తమవిశేషాలు ఉపచయంలోఉండకతప్పవు. ఈవిశేషాలు స్థాయికికూడా సంబంధించి తీరుతవి. ఈఉపచయవృద్ధిలోని అవస్థా భేదాన్నిబట్టి రసముకూడా తీవ్రరసము- తీవ్రతరరసము- తీవ్రతమరసము అని అనంత భేదాలు పొందవలసి వస్తుంది. అఖండ నిర్భరానంద సంవిద్రూప మైన రసంలో ఇట్లాంటితరతమ భేదాంగీకారం అప్రయో జకము, అసమంజసమూను. ఉపచయపరా కాష్ఠను పొందినస్థాయి రసము అని అనటం కూడా సంగతం కాదు. అట్లాగే అయితే స్మితము, హసితము, విహసితము, ఉపహసి తము, అపహసితము, అతిహసితము, అనే హాస్యరసానికి సంబంధించినఆరుభేదాలు ఉప పన్నములు కావు. ఉత్తమమధ్యమాధమ ప్రకృతిభేదాన్నిబట్టి ఈవిభాగం అర్థసహి తం. ఈఆరువిభాగాలలోకూడా స్థాయి ఉప చిత మవుతుంది కాబట్టి ఆస్థాయి ఏకవిధ రసభావమునేపొందాలి గాని నానావిధభేదా లతో కూడుకోరాదు. ఉత్తరోత్తరప్రకర్ష తారతమ్యం ఇష్ట మయితే- కామానికి సంబంధించిన పదిఅవస్థల్లో ప్రత్యేకంగా ఒక్కొక్క-అవస్థకుకూడా ప్రకర్ష తారత మ్యం అవశ్యంగా ఉంటుంది. కాబట్టి శృం గారరతిభావాలు అసంఖ్యేయాలు కావలసి వస్తుంది. అనుపచిత మైతే స్థాయి- ఉపచిత మైతే రసము అనే ప్రణాళికను మార్చి, అనుపచితమే రసము ఉపచితమే స్థాయి అనికూడా పలకటానికి అవకాశం ఉన్నది. స్థాయి ఉపచయం పొంది రసావస్థనుపొందిన తరువాతకూడా హ్రాసం కలిగి ఉండటం ప్రసిద్ధంగా ఉన్నది. ఆవిధంగా అక్కడ హ్రాసం ఉన్నా రసవ్యపదేశం లేకపోలేదు.

పూర్వనియమాన్ని బట్టి ఉపచయం బాగా లేదు. కాబట్టి రస మని వ్యవహారించటానికి వీలు లేదు. స్థాయిరూపంగా ఉన్నప్పు డున్న ఉపచయం రసావస్థలో లేదు. కరుణ రసంలో శోకం స్థాయి, ఇష్టజనవియోగం విభావము వాటివలన ఉత్పన్న మయిన శోకము అనుభావాదులవలన పరిపోషం పొంది రసీభావము పొంది మొదట్లో మహత్తరంగా ఉన్నప్పటికీ క్రమక్రమంగా ఉపశమించటం సకలలోకానుభవసిద్ధం. పూర్వం ఉపచిత మైంది కాబట్టి శామ్యదవస్థలో ఉన్నా కరుణరస మనేవ్యవహారం ఉంది. శామ్యదవస్థలోని శోకం కంటె అనుభావాదులచేత ఉపచితం కాకుండా ఉన్నపూర్వ శోకమే ప్రముఖంగా ఉంటుంది, కాబట్టి అదే రసవ్యపదేశం పొందాలి. ఈవిధంగానే క్రోధము, ఉత్సాహము, రతిభావము ఉపచయం పొందినా కాలవశాన అమర్షస్థైర్య సేవా విపర్యయం కలిగినప్పుడు మంద స్వరూపంతో ఉండటం భావకలోకానికి అవిదితం కాదు. ఆసమయంలో అపచయం ఉన్నా వాటికి రసవ్యవహారం ఉన్నది. పూర్వమతాన్ని బట్టి వీటిని స్థాయిభావాలనుగా పరిగణించాల్సింది. అందువలన రసము భావపూర్వకం కాదు. రసమే మూలకందము. భావా లన్నీ రసంలో అంశములు. రసము భావాలసముదాయం కాదు. రసము ప్రత్యేక మైన విశిష్టరూపం. రసం అఖండతత్వం;అవిభావ్యము. భట్టలొల్లట మతంలో శ్రీశంకుకునికి పైన చూపినవిధంగా విప్రతిపత్తి ఉంది.

విభావము - అనుభావము - వ్యభిచారి అన్నీ రసంలో అనుమాపకాలు. రసము అనుమాప్యం. వీటిసంబంధము అనుమాప్యానుమాపక భావస్వరూపం. విభావాదులవలన నటునిలో ఉన్నస్థాయిభావం ప్రతిగోచరం అవుతుంది. సీతాదివిషయక రతిస్థాయిభావం న్యాయంగా రామాదులకు సంబంధించిందే అయినా రామాదులను నటుడు అనుకరించుతాడు; కాబట్టి ఆరతి నటునిలో అనుకరణరూపంగా గోచరించుతుంది. ఇది అనుకరణరూపం కాబట్టి 'రసము' అని వ్యపదేశము పొందుతుంది. స్థాయి అనుమేయం అయితే రస మవుతుంది. స్థాయివలన రసం నిష్పన్న మవుతుంది అనేవాదానికి ఈమతంలో అవకాశం లేదు. భావమే రసం అని పరమార్థం. ముఖ్యరామాదిగతంగా గోచరించినప్పుడు స్థాయిభావం; నటునిలో అనుకరణ రూపంగా ప్రతీత మైనపుడు రసము. విభావాలను కావ్యబలాన్ని బట్టి అనుసంధించటానికి వీలున్నది. కావ్యంలో ఉన్న అభిధావ్యాపారంవలన సీతారామాదులు చంద్రచందనాదులుగా ఉన్న విభావాలు గోచరం అవుతవి. అనుభావాలు కార్యరూపంగా ఉంటవి. శిక్షాభ్యాసపాటవం సంపాదించిన నటునిలో వాటిని గ్రహించవచ్చు. నటునిలో స్థాయిభావం లేకపోయినా చిరకాలాభ్యాస దార్ఢ్యాన్ని బట్టి అతడు అనుభావాలను ప్రకటించుతాధు. ఈ అనుభావాలు కృత్రిమరూపాలేఅయినాసామాజికులువీటిని కృత్రిమంగా భావించరు. ఈవిధంగా ప్రత్యక్షంగాఅనుభావాలుగోచరించుతవి. రోమాం

చాదులనునటుడుపదర్శించగలుగుతున్నాడు కాబట్టి స్థాయ్యనుకూలవ్యభిచారులు నటుడిలో ఉపస్థితములై ఉన్నట్లు మనము ఊహించటానికి వీ లున్నది. మొత్తం మీద ఈవిషయంలోనిష్కర్షను ఈవిధంగాగ్రహించవచ్చు. కావ్యానుసంధానంవలన విభావాలు- ప్రత్యక్షంగా రోమాంచాద్యనుభావాలు- రోమాంచాదిలింగకములుగా వ్యభిచారిభావాలు ఉపస్థితము లవుతవి. కావ్యంవలనగూడా స్థాయిని అనుసంధించటానికి వీలు లేదు. విభావాదుల్ని తెలియచేసినట్లు స్థాయిని తెలియచేసేవి లేవు. కావ్యంలో ఉండే రతి, శోకము, హాసము మొదలయినపదాలు రత్యాదిభావాలను వాచ్యములుగా చేయగలుగుతవి కాని అభినయరూపాన తెలియచేయ లేవు. రత్యాదిపదా లున్నా రత్యాదిస్థాయిభావమును వాచికాభినయరూపంగా తెలుసుకోవటానికి వీలు లేదు. ఘటపదం కలశానికి అభిధాయక మైనట్లు రత్యాదిపదంకూడా కేవలం అభిధాయకమే. కేవలం అట్లాంటి పదం వాచికాభినయం కాలేదు. అభినయం వాక్యంచేత వాచ్యం కాదు. అవగమనాత్మకవ్యాపారం అభినయము. ఇది వాచకతావ్యాపారం కాదు. అందువలన అనుకర్తలో స్థాయిభావం గోచర మవుతుంది అనవలసిందే. అయినా ఇది అనుకరింపబడే స్థాయి కాని వాస్తవం కాదు. అనుకరింపబడుతోంది కాబట్టే ఆరత్యాదిస్థాయి శృంగారాదిరస మయింది. అందుచేత రసము స్థాయిస్వరూపమే కాని స్థాయిప్రభవం కాదు. 'విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః' అనేభరతసూత్రంలో భిన్నవిభక్తికంగా నైనా స్థాయిపదం ఉపాత్తం కాలేదు. కాబట్టి స్థాయిభావమే రసము.

నటుడు ప్రదర్శించే అనుభావాలు కృత్రిమాలే అయినా అవి కృత్రిమంగాగ్రహించబడవు. నటునియందు రామాభేదబుద్ధి కలుగుతుం దని లొల్లటుడు అనటం సమ్మతం కాదు. ఎక్కడైనా సరే, అభేదప్రతీతి కొంత భేదసహిష్ణువై ఉండితీరుతుంది. భేదావగాహి అయినఅభేదప్రతీతి రసప్రతీతివిరుద్ధము. భేదకలన అణుమాత్రమైనా గోచరింపకుండా ఉన్నప్పుడే రసప్రతీతి అవ్యాహతం అవుతుంది. భేదకలనతోకూడుకొన్న జ్ఞానం రసప్రతీతిలో అంగభావం పొందలేదు. నటుడిలో కలిగేఅభేదజ్ఞానము రసప్రతీతిలో ఉపకరించుతుంది అనటం సాహసం. అందువలన చిత్రతురగంలో మాదిరి నటుడిలో విజాతీయజ్ఞానం కలుగుతుం దని అవశ్యంగా అంగీకరించాలి. ఇట్లాంటి విలక్షణజ్ఞానమే కార్యకారి అవుతుంది. మిథ్యాజ్ఞాన మహిమాతిశయం ఈస్థలంలో ప్రకాశించుతుంది. అందువలన సామాజికులకు రసప్రతీతి కలగటంలో అభ్యంతరం లేదు. జ్ఞానాలు నాలుగురకాలు- సమ్యక్ప్రతీతి- మిథ్యాప్రతీతి - సంశయప్రతీతి - సాదృశ్య ప్రతీతి. ఈప్రతీతులు ప్రసిద్ధాలే. సిద్ధస్వరూపంతో ఉన్నవ్యవస్థలను ఆశ్రయించి ప్రవ

గ్రించేజ్ఞానము సమ్యక్స్వరూపం. ఈప్రకృతి రెండువిధాలు. "ఈతడు రాముడు" అనే సామాన్యరూపంగా ఉన్నశబ్దప్రయోగంలో వ్యవస్థను (నియమము అ వ ధా ర ణ) సూచించేపదం లేదు. వ్యవస్థితితో కూడు కొన్నపదమే అర్థనిర్ణయాన్ని కలుగచే స్తుంది. అందువలన "ఇతడే రాముడు" అని కాని "ఇతడు రాముడే" అని కాని వ్యవస్థను సూచించే విశేషం ఉండితీరాలి. ఇట్లాంటి విశేషసమన్విత శబ్దప్రయోగమే నిశ్చయార్థం కలుగచేస్తుంది. "ఇతడే" "రాముడే" అనేచోట "ఇతడు-రాముడు" పదాలచివర ఉన్న "ఏ" అవధారణాన్ని సూచించుతుంది. ఇతడు విశేష్యము. 'రాముడు' విశేషణము. అవధారణవాచకపద ము విశేష్యంతో సంబంధించినపుడు ఇతర విశేష్యాలలో విశేషణధర్మసంబంధాన్ని నివారించుతుంది. "ఇతడేరాముడు" అనే చోట అవధారణవాచకపదము విశేష్యం తో సంబంధించింది. ఇక్కడ ఇతర విశే ష్యంలో రామత్వసంబంధము నివారింప బడుతోంది. ప్రకృతవిశేష్యంలో రామ త్వమును అవధారణవాచకపదము నియ మించుతోంది. ఇది ఒకవిధమైన సమ్యక్ప్ర తీత. అవధారణ వాచకపదం విశేషణపదం తో సంబంధించినపుడు ప్రకృతవిశేష్యంలో విశేషణ సంబంధం లే క పో వ టా న్ని నిషేధించుతుంది. నియమంగా విశేషణ ధర్మసంబంధాన్ని స్థిరీభవింపచేస్తుం దని తాత్పర్యం. 'రాముడే ఇతడు' అనేది దీనికి ఉదాహరణం. ఇక్కడ 'రాముడు' అనేవిశే షణపదంతో అవధారణవాచకం సమన్వ యించింది. అది 'ఇతడు' అనేవిశేష్యంలో రామత్వాసంబంధాన్ని నిషేధించుతుంది. ఈతనిలో రామత్వము లేకపోలేదు అనే అర్థం ఇక్కడ స్పష్టం. ఇది రెండోసమ్యక్ప్ర తీతి. ఈసమ్యక్ప్రతీతిలో ఈరెండుభేదాలే ప్రసిద్ధంగా ఉన్నవి.

మొదట గలిగినప్రతీతి తరువాత బాధిత మైతే మిథ్యాప్రతీతి అంటారు. ఇతడు రాముడు అని మొదట్లో కలిగిన ప్రతీతి ఇతడు రాముడు కాడు అనే ఉత్తర కాలంలో గలిగే ప్రతీతివలన బాధితం అవు తుంది. అనంతరావతీర్ణ బాధ ఉంటే మిథ్యా ప్రతీతి అని పర్యవసానము. బాధ లేక పోతే మిథ్య కాదు. బాధ నిశ్చయం కలిగే దాకా ప్రామాణ్యగ్రహణం ఉండితీరుతుం దని నిర్ణయము.

ఒకజ్ఞానము పరస్పరవిరుద్ధము లైన రెండు పక్షాలను అవగాహించినది అయితే సంశయ ప్రతీతి. 'ఇతడు రాము డగునా? కాడా? అనేజ్ఞానంలో రామధర్మసంబంధము- రామ ధర్మసంబంధము లేకపోవటం అనే విరుద్ధ జ్ఞానద్వయం ఉన్నది.

సమానము లైన రెండుపదార్థములను అవ గాహించినబుద్ధి సాదృశ్యరూపం. 'ఇతడు రామసదృశుడు' అనేఉదాహరణంలో ఇది స్పష్టసమన్వయము. నటుని విషయంలో

సామాజికులకు కలిగే ప్రతీతి లోకప్రసిద్ధము
లైన ఈనాలుగు ప్రతీతులకంటె విలక్షణంగా
ఉంటుంది. చిత్రతురగంలో కలిగే ప్రతీతి
నటుడిలో కలుగుతుంది. చిత్రతురగంలో
'ఇది తురగమే' అని కాని 'ఇదే తురగం'
అని కాని, ఔత్తరకాలికబాధ ఉన్నపుడు
'ఇది తురగం' అని కాని 'ఇది తురగం అవు
తుందా? కాదా?' అని కాని 'ఇదితురగ
సదృశం' అని కాని ప్రతీతి కలగదు.
అక్కడ విలక్షణవిజ్ఞానం స్ఫురించుతుంది.
ఇది అనుభవసిద్ధం. ఆవిలక్షణజ్ఞానాకారాన్ని
శబ్దంతో చెప్పటానికి వీలు లేదు. ఆవిధం
గానే నటుడిలో విలక్షణంవిజ్ఞానం కలుగు
తుంది. నటుడే సుఖ అనేజ్ఞానం కలగదు.
నటుడే రాముడు అనీ కలగదు. నటుడు
రాముడవుతాడా? కాడా? అనే సందే
హమూ కలగదు. తత్సదృశుడు అనికూడా
కలగదు. చెప్పటానికి శక్యం కాని విజా
తీయప్రతీతి కలుగుతుంది. నటుడివిషయంలో
చతుర్విధప్రతీతి నిరాసంకోసం ప్రదర్శిం
చిన ఉదాహరణాలలో ఒకవిశేషాన్ని గమ
నించాలి. నటుడిలో సీతారతివైశిష్ట్యం
భాసించదు; సీతారతివిశిష్టరామత్వమూ
భాసించదు; సీతారతివిశిష్టుడు కాడు అనీ
భాసించదు; సీతారతివిశిష్టరాముడు కాడు
అనికూడా భావించదు; అనే అర్థాలను పై
వాక్యాలలో అనుసంధానం చేసుకోవాలి.
అక్కడ కలిగేప్రతీతి విజాతీయం కావటం
మూలాన అంతరాంతరా ఊహలో గోచ
రించే విజ్ఞానంకూడా నటుడిలో ప్రసక్తం
కాదు. ఈప్రతీతి అవివేచితసంప్లవము.
ఇట్లాంటిప్రతీతి కలుగుతున్నట్లు ప్రబలాను
భవం ఉన్నది. ఇక్కడ ప్రశ్నలకు అవ
కాశం లేదు. అనుభవాన్ని అపలాపం
చేయరాదు. సహృదయ సామాజికుల
ప్రతీతి ప్రతిక్షేప్యం కాదు.

లోకంలో సామాన్యంగా ప్రతీతి రెండు
రకాలు. సమ్యక్ప్రతీతి - మిథ్యాప్రతీతి
అని. ఇవే విషయభేదాన్నిబట్టి అవాంతర
భేదాలను పొందుతవి. అయినా తదుభయ
విలక్షణప్రతీతి ప్రకృతంలో ప్రయోజకం.
నటుడిలో కలిగేప్రతీతి మిథ్యాప్రతీతికన్న
విలక్షణం కాదే! అనేసంశయం ఈవిష
యంలో కలగవచ్చు. ఆ సంశయనివృత్తికై
ఈఅర్థాన్ని పర్యాలోచనం చెయ్యాలి.
సమ్యక్ప్రతీతిలో నియమసాహిత్యం అవ
శ్యంగా గోచరించుతుంది. అది వ్యవచ్ఛిత్తి
ఫలకం. మిథ్యాప్రత్యయం ఎక్కడైనా సరే
బాధశిరస్కంగా ఉంటుంది. ప్రకృతంలో
నటుడి విషయమై కలిగేప్రతీతిలో నియమ
సాహిత్యం కాని వ్యవచ్ఛేదనిషయం కాని
లేదు. ఇది బాధశిరస్కంకూడా కాదు.
అందువలన ఇది తదుభయావతీర్ణం. ఈ
ప్రతీతి భేదావగాహిని కాదు. ఇది విలక్ష
ణం కాబట్టి రసప్రతీతికి అంగము. ఈ
ప్రతీతిలో నటుడు విషయం. విభావాను
భావవ్యభిచార భావాలు హేతువులుగా
అనుమీయమానం అవుతూఉన్న స్థాయి
భావానికి నటుడు ఆశ్రయం. అనుమాన

ప్రక్రియనుబట్టి నటుడు పక్షం అన్న మాట స్థాయి సాధ్యము. విభావాదులు హేతువులు. ఈ విభావాదులు కృత్రిమాలే. స్థాయిసంబద్ధాలు కావు. అయినా ఇవి కృత్రిమాలుగా గ్రహించబడవు. నటుడిలో ఉన్న ఈసామగ్రి స్వస్వరూపాన రత్యాది భావాన్ని అనుమానింప చేయలేదు. సామాజికులజ్ఞానంలో ఇవి గోచరములై స్థాయిని అనుమేయం చేయటానికి సమర్థము లవుతవి. సామాజికుల ఈజ్ఞానము భ్రమాత్మకము.

విలక్షణవిజ్ఞానంలో నటుడు గోచరం అవుతాడు. అతనిలో ఏదో విధమైన రామప్రత్యయం కలుగుతుంది. అప్పుడు ఈ రాముడు సీతారతివిశిష్టుడు అని అనుమానం (ఊహ) కలుగుతుంది. అక్కడ సీత ఆలంబనము. చంద్రాదులు ఉద్దీపన విభావాలు. రోమాంచాదులు అనుభావాలు. ఔత్సుక్యాదులు వ్యభిచారులు. ఇట్లాంటివిభావాదులు కలిగి ఉన్నాడు కాబట్టి అని హేతువు. రాముడు అనేప్రత్యయంలో గోచరించే వ్యక్తి పక్షం. సీతారతివైశిష్ట్యం సాధ్యం. ఎవడెవడు ఇటువంటి విభావాదులు కలిగి ఉంటాడో ఆతడాతడు అటువంటి రతివిశిష్టుడు అని అనుమానపరిపాటిలో వ్యాప్తి. దీన్ని అన్వయ వ్యాప్తి అంటారు. ఎవడు ఆవిధంగా కాడో ఆతడు రతివిశిష్టుడు కాడు అని వ్యతిరేక వ్యాప్తి. ఇట్లాంటి అనుమానమే ఇక్కడ చమత్కారప్రాణము. ఇదే సామాజికుల చర్వణ. అందువలన రసం సామాజికాశ్రయమే. రసవిషయంలోని ఈ అనుమాన ప్రణాళిక పర్వతో వహ్నిమాన్ ధూమాత్ అనేనిస్సారానుమితులవంటిది కాదు. సామాన్యంగా సాక్షాత్కారం చమత్కారప్రదమవుతుంది గాని అనుమితి చమత్కారప్రదం కాదు. ఊహాలో గోచరించేది కూడా చమత్కారాన్ని సంపాదించేటట్లయితే సుఖం స్వాభావికంగా లేకపోయినా ఊహ చేసినంతమాత్రాన ఆనందసంధానం చేయ్యాలిసిందే. కాని ఇక్కడ వస్తువులు మాత్రం స్వభావసుందరాలు. ఈసౌందర్యబలంవలన ఊహింపబడే రత్యాదులు రసనీయములు అయి తీరుతవి. భావనాసముపనీత నవనీతకోమలాంగీ సమాలింగనము ఆనందప్రదం కావటం సకలసౌహృదయానుభవసిద్ధమే. కాబట్టి ఇది అన్యానుమీయమాన విలక్షణం, పరమకమనీయము, రసవ్యవహారయోగ్యమూను. ఇది భ్రాంతిగృహీతమైనా సహృదయులకు చమత్కారాన్ని సంపాదించటంలో సమర్థమే. భ్రాంతిప్రతిపన్నంకూడా కార్యకారిగా ఉండటం లోకప్రసిద్ధమే. కుజ్ఝటికా (పొగమంచు) పాతసంకులమైనప్రదేశంలో వాస్తవంగా ధూమం లేకపోయినప్పటికీ ధూమజ్ఞానం కలగటం అనుభవసిద్ధమే. అట్లా ధూమాభిమానం ఉన్న ఆప్రదేశంలో ధూమనియత వహ్న్యనుమానం కలగకపోదు. అనుమితి హేతువులో సాధనతాజ్ఞానం ఉంటే చాలు సాధ్యసిద్ధి అవుతుంది. ఆవిధంగానే నటు

డిలో విభావాదులు లేకపోయినా నిపుణంగా పరిదర్శింపబడ్డప్పుడు ఆ విభావాదులందు విలక్షణ జ్ఞానగోచరం అవుతూవున్న వ్యక్తిసంబంధం బుద్ధిలో గోచరించుతుంది. ఆవిధంగా విభావాద్యభిమానం అక్కడ ఉన్నప్పుడు విభావాదినియతరతిభావము అనుమీయమానం అయితీరుతుంది. అట్లా అనుమితమైనరతి స్వసౌందర్య సరసతా మహిమవలన సామాజికులకు ఆస్వాద్యం అవుతుంది. ఆవిధంగా ఆస్వాదింపబడే ఆరతి చమత్కారపారిణామై రసవ్యపదేశం పొందుతుంది. కాగా రత్యనుమానమే రసనిష్పత్తి అని పరమార్థము.

[అభినవగుప్తాచార్యుని అభినవభారతిని కొంతవరకు అనుసరించి]

# శిల్పి

కొండూరు వీరరాఘవాచార్యులు
పులివర్తి శరభాచార్యులు

ఆ పురాతన గుహాల గాఢాంధకార
శయిత నిద్రాణ శిలల కైశ్వర్య మొదవి
కళలు మూర్తీభవించు విగ్రహము లయ్యె
కేలి యులితోడ వాని దాకితివొ లేదొ?

శిథిల విగ్రహ నఖ శ్రీ రేఖలో గూడ విశ్వ మోహన శక్తి వీడలేదు;
రిపు ఘన చ్ఛన్న కీర్తి జ్యోత్స్నలో గూడ సాంద్ర ప్రకాశమ్ము సమయ లేదు;
యుగ ధూళి పడి మాసియున్న రూపున గూడ జయ శాసనము వన్నె జంక లేదు;
ప్రతిభా గరిమ సంస్మరణ దప్పినను గూడ భువన స్థితిని గోలుపోవ లేదు;
చరితలో నిన్ను వెదకి వేసారి గూడ ఘనుల హృదయాల గాన మాగినది లేదు;
నీ కళాకీర్తి జయ మనీషా కథాళి ఏ యెడద వీణ పాడు కోదోయి శిల్పి!

ఈ మలీమస పాషాణ హృదయ ఫలక
ముల వినిర్మల మృదుల కాంతులు స్రవించు
చున్న దైవీ కళామూర్తు లుదయమయ్యె
నీవు మలచిన రూపు ధ్యానింప శిల్పి!

బ్రహ్మ తేజస్స్రవంతి పార గృశియింప
పార్థివ జయ పతాక నిల్వబడి పోవ
సస్యలక్ష్మీ కృపా కటాక్షములు వ్రాల
క్రిమ్మరిల నీవె పో మూలకారణంబు.

బౌద్ధ యుగ వైభవము రాతి పలక పుటల
దెల్లముగ వ్రాయ గాల శైథిల్య ముద్ర
పడిన యవి చూచి చదువుకో గడగి నవుడు
నీవు తలపున రాగ గన్నీరు గార్తు.

నియత క్రియాశక్తి నిలిచిన నీవు
రాళ్లలో దేవుళ్ల రప్పించి నావు;
పశు మానవుని భక్తి పరుని జేశావు;
పుణ్య దుగ్ధంబుల బొంగించి నావు;
విశ్వ గేహం బెల్ల వెలిగించి నావు;
లోక సేవానిధిలో మున్గి నావు;
కర్మ యోగమున గాకలు దేఱి నావు;

ఓ లోక శుభకల్ప ఓ మహాశిల్పి!
ఓ విశ్వ కృద్భక్త ఊర కున్నావ!

ఆశా తటమ్ము లల్లాడి పోవంగ
నీ యశో వాహినుల్ నిండి పోనీర
భువన పీఠము పైన పూజింప బడగ
హృదయ వీణాతంత్రి నెవుడు మ్రోగుమురా!
నీ కళా తోరణాల్ నెలకొల్పు కొనగ
ఉలి తువ్వ కుప్పలు దులిపి వేయుమురా!

మరల భారత దేశ మంతా
భగవ దాలయ వాటి జేయర
భక్తి బంధుర భావములతో
ప్రణతు లచ్చేము శిల్పి!
ప్రస్తుతించేము.

శిల్ప విద్యా ప్రవీణు దాచి పడవేయ
పూర్వ సాహిత్య వాణి కేవుట్టి మునిగె?
విస్మయము పొంది సుకవి సంపన్న వీన
జీవ లేఖిని నిన్ను పూజింప గలదు;
ప్రత్యూష సాంధ్య రాగ నీరాజనముల
ప్రాకృతీ దిగంగనల్ పాడ గలరు
నిత్య జయ మంగళము నీకు నిఖిల భువన
జన శివంకర మూర్తి కైశ్వర్య నిధికి!

# విషాదము

వెనుమర్తి వెంకటరత్నము

ఈ నవానంద తుందిల మైన జగము
నా కనులకీ విధాన గన్పడు నిదేమి?
భయదమై భూత నర్తనోదయ లయాంత
భీకరమ్మయి చీకట్ల లోకమునయి.

ఎడనెడ జరించు నామ్రోడుటెడదలోన
ఆసలను రేపు చైతన్య భాసమాన
నవ్య మధుమాస వేళ, ఈ నాడు నన్ను
ఇంతటి వికారముగ వెక్కిరించు నేల ?

నా సమస్తమ్ము తోడ ననంత కోటి
జీవ గోళమ్ము, జంగమ స్థావరమ్ము
కారు నలుపులు గ్రక్కు వికార రేఖ
నా కనుల కేల దోప నున్నవియో—యేమొ?

ఈ మహా సర్గ సంభృత గ్రామ మందు
ప్రతి యణువు గూడ చైతన్య భాసితంబు !
ప్రతి పిపీలిక మానంద భాగధేయ !
మే నొకడనే మహా శూన్య మైన జీవి !

# భీమపాకం

## కాకకృష్ణమూర్తి

"మంచి సమయం చూచుకొని మరీ కూచుంటావు నువ్వు! ఈ సాయంత్రం దాకా ఓపిక పట్టిఉంటే, నిజంగా ఎంత సదుపాయంగా ఉండేది! మధ్యాహ్నం రెయిల్లో మీ అమ్మ ఎలాగూ వస్తూ ఉంది కదా, యింతలో ఏం తొందర వచ్చిందని—"

కంటికున్న చత్వారం జోడు నుదుటికి ఎగదోసి, చేత కాఫీ కప్పు పట్టుకొని, మూతి కాల్తూఉన్నా మీసాలు అడ్డుపెట్టి ఊదుకొని తాగుతూ భార్యతో ఖులాసాగా సంభాషిస్తున్నాడు మా మామ.

ముసిముసిగా నవ్వుతు ఆమె, "బాగుంది మీరనే మాట!" అని యింకా చెప్పదలచుకున్న జవాబేదో కొంత కళ్ళతో చెప్పి, "పోనీ లెండి, యిప్పుడు మించి పోయిందేమిటి ? పిల్ల చేత గున్నమ్మకి కబురు చేస్తాను. అవిడె మన బంధువురాలు కాకపోయినా, పాపం చాలా మంచిమనిషి. ఈపూటకేదో యింత ఉడకవేసి పడేస్తుంది. మీరెందుకు చెయ్యికాల్చుకొని అవస్త పడడం?" అన్నాది భర్తవైపు నిదానంగా చూస్తూ.

గది వరండాలో వాలుకుర్చీలో చేరబడి, అప్పుడే వచ్చిన ఉత్తరాలూ, వార్తాపత్రికా తీరుబాటుగా తిరగవేస్తున్నాడు మామామ, మధ్య మధ్య ఆమెతో ఏవో కబుర్లు చెబుతూ. సావిట్లో ఉన్న గడియారం 7 గంటలు కొట్టింది.

భాద్రపదమాసం రోజులవి. చురికే యెండలు, బలువైన వర్షాలు, రాత్రిళ్లు చలి, పగలు ఉక్క, నదిలో బురదనీళ్ళు, ఒంట్లో నీరసం యింట్లో జొన్నపట్టులు దొడ్లో కూరగాయల పాదులు పశువులకు పచ్చగడ్డి, దేవుళ్లకు పువ్వులు, మనకు దోమలు, దుర్వాసనలు, గ్రుడ్డిమబ్బులు, ఇంద్రధనస్సులు, నక్కకూతలు బలే చిత్రమైన ఋతువు! ఆవేళ రోజూకంటె తీక్ష్ణంగా ఉదయించాడు సూర్యుడు. గోదావరిగాలి మనోహరంగా వీస్తూఉంది.

నవ్వుతూ మా మామ, "ఏం, నావంట అంటే నీకు అంత చులకన ఎందుచేత? ఆమాత్రం గున్నమ్మపాటి వండలేననా? నడ్డివంగిపోయి దృష్టితిన్నగా ఆనని ఆముసలమ్మనెందుకు శ్రమపెట్టడం? అదిగాక యీవాళ ఆవిడకు ఏకాదశి. ఉపవాసం బడలికతో ఆమె ఏం వండగలదు పాపం? ఇంతకూ యీవాళ సెలవుదినమే కద! నాకు కచేరీ బెడద లేదు, పిల్లలకు స్కూలు తొందర లేదు" అన్నాడు.

"అన్నీ నిజమేకాని, మీరు వంటకి మడి కట్టుకుంటే గున్నమ్మతో పాటు మనందరం కూడా ఏకాదశి పాలించవలసి వస్తుందేమో అని నా దిగులు!" అన్నాది మా అత్త నవ్వుతూ.

అతని కుర్చీకి కొంచెం యెడంగా అవరండా మీదనే నేల కూచొని, జుట్టేలేని చేతివాడికి ముచ్చటగా క్రాపింగు దిద్దుతూ ఉంది ఆమె. తల్లి వద్దనుంచి తప్పించుకొని కిలకిలానవ్వుకుంటూ తండ్రివైపు బంగురుతున్నాడు పిల్లడు. వాడి అన్న ఐదేళ్ల వాధవయి కూడా యింకా నిద్ర లేవనేలేదు. ఇక లేచిన తరువాత ఇల్లు తీసి పందిరివేస్తాడు వాడు.

నరుసు, నేను కాఫీల దగ్గిర చిలిపిజగడం పెట్టుకొని, ఉడికింపుమాటలతో ఒకరినొకరం సాధించుకుంటున్నాం. ఇడ్లీపచ్చడి మారువెయ్యమంటే, నా కంట్లోకి, చొక్కామీద తుళ్ళేటట్లు విస్సాటంగా వడ్డించింది నరుసు. కన్ను భగ్గుమనగానే నా చేతులో

గ్లాసు దభీమని కిందపడింది. నా లాగుమీద, వరుసు పరికిణీమీద, మేం తింటున్న యిడ్లీప్లేట్లలోను వొలికింది కొంత కాఫీ. తొడ చురికి మండుతూఉందని గోల చేసింది వరుసు, 'అమ్మో బావచూడవే ఎట్లా' ...అని రమో ఫిర్యాదు చెయ్యబోయిన వరుసును చేత్తో బలవంతంగా నోరుమూసి, చెప్పవద్దని సౌజ్ఞ చేస్తూ గడ్డం పట్టుకొని బతిమాలాను.

వాళ్ళమాటల గొడవలోనూ, నవ్వులలోను మా అల్లరి తెలియరాలేదు మా అత్తకు, మామకు. లేకుంటే మా యిద్దరికీ చివాట్లు తగిలేవే-ముఖ్యంగా సరికొత్త వెండి గళాసు సొట్టపోయినందుకు.

"ఈవాళ చూద్దువుగాని కదూ, నావంటమజా! అంత చేతకాని వాడికింద కట్టేయకు మరి నన్ను! వంట అనేది ఆడవాళ్ళకు మాత్రమే అలవడే మహావిద్య అని కాబోలు నీఊహ? తల్చుకుంటే సంతర్పణ వంటకైనా వెనుదియ్యననుకో!" అంటున్నాడు మామామ బడాయిగా.

అతని మాటలకు నాలో నేను నవ్వుకున్నాను. మా మామ వంట యింట్లో ఎవరికి కొత్త గనక? వంట రాదని కాదు. 'థియరీ' అంతా క్షుణ్ణంగా తెలుసును. కాని బ్రాహ్మడికి పిసరంత ఓపిక లేదు. వంటిల్లొక యుద్ధభూమిగాను, తాను వీరావేశమెత్తిన యోధుడు గాను, ఊహించుకుంటాడు కాబోలు ఆ నాలుగు ఘడియలూను! ఇంట్లో ఉన్న యావన్మందినీ అది చెయ్యమనీ, యిది చెయ్యమనీ, పురమాయింపులతో నలిపి చంపుతాడు. ముచ్చెమటలు పోసిపోయి, తాను అయాసపడి, మమ్మల్ని అయాస పెట్టి, అందర్నీ తిట్టి, తను తిట్టుకొని, యింట్లో తుఫాను లేవనెత్తి, యిరుగు పొరుగు వాళ్లకు సహితం వార్తిస్తాడు.

"వరుసూ, ఈ వాళ మన పని పట్టిస్తాడులే మీ నాన్న" అన్నాను రహస్యంగా.

"ఇంట్లో ఉండకుండా ఎక్కడికైనా దాటేస్తే సరి. పద తోటలోకి వెళ్ళి జాంకాయలు కోసుకొని, అగడ్తపాళ వెనక దాగుందాం" అని సలహా యిచ్చింది వరుసు.

"లాభం లేదు—తన్నులు తగుల్తాయి!" అన్నాను తల ఊపుతూ.

వరుసు, నేనూ ఏం చేద్దామా అని కలబోసుకుంటూ గుసగుస లాడుకోవడంలో మా అత్తామామల సంభాషణ కొంత వినరాలేదు నాకు.

"......చిత్రమైన మనుషులు మీరు! క్షణం కిందటనే కదూ నామీద ఎంతో విసుక్కున్నారు—వంట పని మీ మీద పడిందని! ఇప్పుడేమో వండడానికి ఉబలాటపడుతున్నట్లు, ఎన్నాళ్ళనుంచో అందుకోసం తపిస్తున్నట్లు మాట్లాడుతున్నారు! సరే మీయిష్టం. కాని పిల్లల్ని చద్దిఅన్నం పెట్టుకొని తినమనండి. మీరు కూడా కప్పు కాఫీ అధికం తాగండి. ఎందుకైనా మంచిది. కీడెంచి మేలెంచమన్నారు పెద్దలు." అంటూఉంది మా అత్త నవ్వుతునే.

"అదిగో నాకు తెలుసు నువ్విట్లా అపశకునాలు పలుకుతావని! నావంట అంటే నీకు ఎప్పుడూ వేళాకోళమే. ఇట్లా ఉత్సాహభంగం చేస్తూ నన్నుగతాళి చెయ్యకపోతే, నీ కేమేమి కావాలో, ఏయే పదార్థాలు ఏవిధంగా వండితే నీకూ పిల్లలకూ హితవుగా ఉంటాయో, అన్నీ చెప్పి చేయించుకో రాదూ?"

"చాలులెండి యీ హెచ్చులు! ఎవరైనా వింటే నిజమే అనుకునేరు. అన్నీ పురమాయించి, మొగుడిచేత పంచ భక్ష్యపరమాన్నాలు వండించుకొని విజృంభిస్తూ ఉంది కాబోలీవిడ, అని నలుగురూ నన్ను దెప్పి పొడవగలరు! ఇంట్లో ఎవరూ ఆడదక్షత లేనప్పుడు బయట ఉండడమంటేనే నాకు నిజంగా ఎంతో బెంగగా ఉంటుంది." అన్నది మా అత్త.

"పోనీ మానివేయరాదూ!" అన్నాడు మా మామ మెల్లిగా నవ్వుతూ.

"అలాగే!" అని తల తమాషాగా తిప్పుతూ, "ఏమిటామాటలు, జ్ఞానంవచ్చిన పిల్లల ముందు?" అని ఛరుస్తున్నాది మా అత్త, లేని కోపం స్వరంలో చూపెడుతూ.

నరుసు, నేను, ఒకరికళ్ళలోకి ఒకరం చూచుకొని ముఖాలు వంచి ముసిముసిగా నవ్వుకున్నాం.

తెలిసీ తెలియని యీడు మాది. నరుసు పది పదకొండు ఏళ్ళది, నాకంటె యేడాదో, రెండేళ్ళో చిన్నదైనా, నాఅంత యెత్తూ ఉండేది. 'పొట్టిబుడంకాయ' అని నన్ను అదీ, 'పొడుగు బెండకాయ' అని దాన్ని నేనూ, ఉడికించుకునేవాళ్ళం. తెల్లగా, సన్నగా, యేపరిగా ఉండేది- పెద్దకళ్ళు నల్లజాట్లు, తెల్లని యెులకపళ్లు, నవ్వితే కొంచంలో తలుపడే గాజుబుగ్గలు - మంచి అందంగా, చలాకీగా ఉండేది నరుసు. కాని మొగం తీరులోను ఒంటిరంగులోను అది కొంతవరకు తల్లినేపోలినా పంతానికీ అనవసరంగా నావంటి అయాయకులతో దెబ్బలాడడానికీ ముక్కోపానికీ మూడుమూర్తులా మా మామనే పోలింది!

అన్నివిధాలా యోగ్యుడేకాని కోపంవస్తే ఒళ్లు మరచిపోతాడు మా మామ. మొగం కందగడ్డవలెచేసి వణికే గొంతుకతో ఇంటికప్పెంకు లెగిరిపోయేటట్లు గావుకేకలు వేస్తాడు. మళ్ళీ కొస్సేపటికి శాంతమూర్తివలె బహునెమ్మదిగామృదువుగా ప్రవర్తిస్తాడు. హృదయంలో కపటం వైరం లేవతనికి ఎవరిపట్లా! ఇంట్లోఉన్న నౌఖర్లను సహబంధువులవలెను, స్నేహితులవలెను చూస్తాడు అభిమానంతో, అందుచేత అతను ఇంట్లో ఎవరి నేవిధంగా తూలనాడినా ఎవరూ అట్టే నొచ్చుకోరు. కాని అతని ధాటికి అగ్రహానికి మా అందరికీ హడలే! ఆ రెండు నిమిషాలు అతని కంట పడకుండా ఎక్కడికైనా పారిపోయేవాళ్ళం నరుసూ నేను, ముప్ఫయియేళ్ళు ఒంటికొచ్చి ముగ్గురు బిడ్డల తల్లి అయిన మా అత్తకూడా యింకా భయంతీరినట్లు వర్తించదు ఆయనతో. చనువుగా మాట్లాడుతుంది, హాస్యాలాడుతుంది, తగవులాడుతుంది, వాదిస్తుంది, ధైర్యంగా ఎదిరిస్తుంది—కాని బెదురుతునే ఉంటుంది మనసులో.

ఎనిమిదిగంటలకు స్నానంచేసి మడి కట్టుకున్నాడు మా మామ. యజ్ఞంతల పెట్టుకున్నవాళ్ళయినా నిజంగా అంతా హడావిడి పడరు. మంచి ఉత్సాహంగా ఉన్నట్లు కనిపించాడు మనిషి.

"అమ్మాయీ, ఈవాళ ఫిడేలు పట్టుకొని కూచోక నాకు అదీ, యిదీ సాయం చెయ్యాలిసుమా నువ్వు. నీసంగీతం మాస్టరు వస్తే, యీపూటకి పాఠంలేదని చెప్పి, పంపించివేయి" అని నరుసుతో చెప్పి, నాతో "ఒరేరామం, నువ్వెక్కడికీచపోయిం చేయక, చదువు గిదువు కట్టిపెట్టి నాకు కొంచెం ఆసరాగా ఉండాలి వంటింట్లో." అన్నాడు.

నరుసూ, నేనూ ఒకరిమొగం ఒకరం చూచుకున్నాం, నవ్వురాకుండా మాటులు బిగించుకొని. "అమ్మా, యిట్లారా," అని నరుసును దగ్గిరికి పిల్చింది మా అత్త.

"వంటిల్లు శుభ్రంగా ఊడ్చి, పెడపొయ్యిలో నిప్పుచెయ్యి. అప్పలమ్మను తొందరగా అంట్లగిన్నెలన్నీ మసి ఉండిపోకుండా తోమి యిమ్మని చెప్పు........తమ్ముడు లేచినట్లున్నాడు! వెళ్లి చూడు, వాడికి కాఫీ వెచ్చబెట్టి యిచ్చి, మీ నాన్నగారు వంట ప్రారంభించిన తరవాత, మీరందరూ చద్దన్నాలు పెట్టుకొని తినండి, కొట్లాడుకోకుండా......పెరడు ఊడుస్తూ ఉంది కాబోలాపిల్ల, నాగు. దాన్ని పిల్చి, అబ్బాయికి హార్లిక్సు పాలు కలిపి పొయ్యమని చెప్పు," అని చెప్పింది. నరుసు గునుస్తూ లోపలికి వెళ్లింది. తల్లి ఏపని చెప్పినా, దానికి ఎప్పుడూ గునుపే. పని అంటేనే దానికి కొంత అయిష్టత, కొంత బధకం, కొంత పెంకెతనమున్ను! అందుకు తోడు ఇంగ్లీషు చదువు సంగీతం, లేసు కుట్టు, తల్లిదండ్రుల ముద్దు, దాన్ని మరింత పనిదొంగని చేస్తున్నాయి.

"అత్తా, లోగడ ఎప్పుడో ఒకసారి మామ వంట చేసి పెట్టాడు మనకి—జ్ఞాపకం ఉందీ! 'వంకాయ

ముద్ద' అని, ఉడకని పచ్చిపచ్చిగా ఉన్న కూర ముక్కలను గరిటెతో గట్టిగా చితకగొట్టి ముద్దగా చేసి విస్తట్లో పెట్టటం.''

"అవును. ఉండాళ్ళు, జిల్లేడుకాయలు వలెతయారైన అన్నం: ఉప్పు కషాయమైన పులుసు; నలగని పచ్చడి.''

"కడుపునిండా తినలేమని కసిలేవాడు పైపెచ్చు!'' ఇల్లాంటి ముచ్చట్లే ఇనకటి లేవో చెప్పుకుంటూ మా అత్త, నేను, ఉప్పెనగా నవ్వుకుంటున్నాం. ఇంతలో మెడలో చిక్కుపడిన జంధ్యం, భుజాన్ని తడితువాలు, నుదుట విభూతి, దువ్వుకోని సగం నెరిసిన క్రాపింగు, ఎగబెట్టి గట్టుకున్న పొత్తిపంచ పీటితో వచ్చి, ఠీవిగా ద్వారబంధాన్ని ఆనుకొని నిల్చున్నాడు మామామ.

"ఇక నా ఆలస్యం ఏమిలేదు. బ్రాహ్మడు నీళ్ళు తెచ్చిపోశాడు. కూర, నార యేదో తెముల్చుకొని, చప్పు చప్పున వండేస్తాను. ఏమేమి వండమన్నావో చెప్పు- అనక నిష్ఠూరాలాడక.'' అన్నాడు మా అత్తతో.

"అట్టే బెడద పెట్టుకొని చికాకు పడకండి. నా మాటవిని ఏదోఒక కూర, యింతపప్పు, అన్నంవండండి; చాలు. ఊరగాయలు; పచ్చళ్ళు ఉన్నాయి ఉట్టిమీద కుండలో తోడుపెట్టిన పెరుగుఉంది. కావలిస్తే అనక నాలుగు అప్పడాలు కాల్చుకోవచ్చు''అన్నాది మా అత్త.

"చాల్చాలు, యిదా నీ సలహా! ఏం ఖర్మం వచ్చిం దని యేమీ చేసుకోవద్దంటావు? న్యాయం పట్టిపిండివంటలుకూడా తలపెట్టుకోవలసిన సంగతి. మనం పెద్దవాళ్ళం ఎట్లా కాలక్షేపం చేసినా పిల్లలు ఊరుకుంటారా? అమ్మాయికి పెరుగుపచ్చడి కావాలి; అబ్బాయికి పులుసో చారో ఉండి తీరాలి. రామానికి వేపుడు ముక్కలుండాలి!''

"ఇంకా—?'' అంటూ నవ్వింది మా అత్త.

"అవునే మరి! అర్ధాకలితో విస్తరిముందు నుంచి లేచిపోలేం కద!''

"విస్తరిముందు కూచునేదాకా రావద్దూ కథ''

"మా చక్కా వస్తుందిలే, మరేం భయపడకు! ప్రపంచంలో మనం పడే అవస్థలన్నీ అసలు దేనికోస మని? తిండికే కద! అంచేత, చేసుకున్న పదార్థాలేవో తృప్తికరంగా కడుపు నిండే టట్లు ఉండాలి.''

"నిజమే—చేసి పెట్టేవాళ్లు ఉన్నప్పు డామాట!''

"నేనన్నదీ అదే కదూ! ఇంగ్లీషు వాళ్లలో ఒక సామిత ఉందిలే,'ఎండ కాచినప్పుడే గడ్డి తయారు చేసుకోవాలి' అని. ఎప్పుడోకాని రావుకద, యిటువంటి అవకాశాలు? పురుషపాకం—అందులో భర్తది—తలవని తలంపుగా తటస్థపడినప్పుడు, నిజంగా ఎంత సంబరపడాలి నువ్వు. నాలుగూ చేసి పెడతాను, తినమంటే, వద్దంటావేం ఖర్మం, నాకు శ్రమ అనా? ఉత్సాహంతో కోరి చేసే పనిలో ఎప్పుడూ శ్రమ ఉండదు. లేక నాకు చేత కాదనా? చూడు, ఈవాళ నల భీమ పాకాలను మించి, దేవతలకు సహితం నోరూరేటట్లు తయారు చేస్తానో లేదో వంట!''

"మీ పుణ్యముంటుంది, అంత పని మాత్రం చెయ్యకండి! లేకుంటే దేవతలు, పితృదేవతలు, అంతా దిగి రాగలరు ఈ వాళ!'' అన్నాది మాఅత్త విరగబడి నవ్వుతూ.

"పది గంటలకల్లా నీకు వడ్డించలేకపోతే అప్పుడను ఆమాట'' అంటూ గడియారం వైపుచూసి మళ్ళీ ఆమెతో "చప్పున తెముల్చు మరి శాకపాకాలేమిటో—'' అన్నాడు మామామ.

నవ్వు సమాళించుకొని "అబ్బ! మీ యిష్టం వచ్చిందేమో చేతురూ నన్ను అడక్క. బుట్టలో ఏవో కూరగాయలు దుంపలు ఉన్నాయి. పెరట్లో ఏరితే ఇంకా కాయగూర లేమైనా దొరుకుతాయి. మీకు ఏమేంకూరలు పచ్చళ్లూ ఏయేవిధంగా చెయ్యాలని ముచ్చటయితే ఆవిధంగా చెయ్యండి'' అన్నాది మా అత్త.

"నిజమేనా? అనక ఆక్షేపించవు కద?''

"ఛా ఎంతమాట!"

"అయితే సరే సర్వస్వాతంత్ర్యం నాకే విడిచిపెట్టా వన్నమాట?"

"పూర్తిగా!"

"ఇక చూసుకో అయితే! పప్పు, ఒకటో రెండో కూరలు, వంకాయో దోసకాయో కలిపి పెరుగు పచ్చడి, అరవవాళ్ళ సాంబారో లేక కొబ్బరివేసిన మలబారు చల్లపులుసో—"

"లేకపోతే పోలాల అమావాస్యనాడు వండుకునే ఏడుకూరల బెల్లం పులుసో—"

"అవునునుమా, బాగా జ్ఞాపకం చేశావు!" అన్నాడు మామామ, తల ఊపుతూ. "ఇంకా జ్ఞాపకం చేస్తాను కావలిస్తే, మీకు మనకు ఉన్న మునిలి తిళ్ళన్నీ! కొళంబు, బెంగుళూరు కూటు, ఓధుప్రిల రెస్సారు, ములగకాడల రసం, వడియాలయిగురు, పెసరట్లు కురమా, పనసపిక్కల పప్పుకూర.—"

"అదిగో, వేళాకోళం చేస్తున్నావూ!"

"మరికాకపోతే ఎందుకొచ్చిన కాదామర కవిత్వాలు చెప్పండి,—ఏదో యీ పూటకి కిరిదీ గడుపుకో? లేనిపోని వన్నీ తలపెట్టుకోవడం, అనక తెమలలేక చీదరించుకొని నానా చికాకూ పడిపోవడమున్నూ!"

"అదా నీభయం!"

"అంతేకాదు. మీరు శ్రమపడి అన్నీ చెయ్యడమే కాని, ఎవరా తినేవాళ్ళు ఇంట్లో? మనపిల్లల సంగతి యెరగరా యేమిటి మీరు? ఎప్పుడూ భోజనాల దగ్గిర అల్లరి పెట్టడమే, పెట్టిన అన్నాలలో రోజూ సగం పారెయ్యడమే కదా!"

"అయితే పోనీలే- ప్రోగ్రామ్ చాలావరకు టూకీ చేసేదాం! ఒరే రామం వెళ్ళిచూడు—పాదుల్లో కూరలేమైనా దొరుకుతాయేమో......వరుసు ఏదీ? అమ్మణీ—"

"వంటింట్లో నిప్పు చేస్తూఉంది కాబోలు" అన్నాది మా అత్త.

"పాపం దానికేం చాతనవుతుంది? నేనే చేసుకుంటాను" అంటూ లోపలికి వెళ్ళిపోయాడు మా మామ.

తరవాత కొంతసేపటికి పందిరెక్కి నేను దొండకాయలు కోస్తూఉండగా వంటింట్లోనుంచి పిలిచాడు నన్ను.

"త్వరగా రా! ఏంచేస్తున్నా వక్కడ?" బుట్టతో కాయలు పట్టుకొని పరుగున వెళ్లాను వంటింటి గుమ్మం దగ్గిరికి. అతని మొగం నాకు, నా మొగం అతనికి కనబడనంత దట్టంగా క్రమ్మి ఉంది అక్కడ పొగ!

"ఆ బుట్ట అక్కడ పడేసి, చప్పున వెళ్లి విసనకర్ర తీసుకురా, పొయ్యి మండకుండా ఉంది," అంటూ తిరిగీ పొయ్యి ఊదబోయినాడు నోటితో.

నిప్పురవ్వలు ఎగిరి అతని మొగం మీద పడ్డాయి. కళ్లు వేళ్లతో మూసుకొని నులుపుకుంటూ, రొయిడంగా జరిగాడు పొయ్యి వద్దనుంచి.

ఇల్లంతా గాలించినా నాకు విసనకర్ర ఎక్కడా కనపడలేదు. అందరం అన్ని పనులూ విడిచిపెట్టి దానికోసం వెదకడం ప్రారంభించాం.

"తెచ్చావా?" అంటూ మళ్లీ విన వచ్చింది మా మామ కేక.

"పోనీ అబ్బాయిగారూ, నేను నీళ్ళపొయ్యి ఊదుకునే వెదురుగొట్టం ఉంది—తీసికెళ్లండి" అన్నాది అంట్లు తోముతున్న అప్పలమ్మ.

ఈలోపున అక్కడి పొగకు తాళలేక వచ్చి సావిట్లో నిల్చున్నాడు మామామ— అంగవస్త్రంతో కళ్ళు అద్దుకుంటూ. కళ్ళు ఎర్రబడి నీరు కారుతున్నాయి. మొగం కందింది. తలమీద ముగ్గుజల్లినట్లు అక్కడక్కడ బూడిద పడి ఉంది.

"మరికొస్త కిరసనాయిలు పోసి ముట్టించండి" అని సలహా యిచ్చింది మా అత్త.

"ఇప్పటికి మూడుసార్లు అయినది అట్లా—ఏం ప్రయోజనం? అకట్టెపుల్లలు పచ్చివో, లేక వర్షంలో

తడికాయా! ఎంతసేపూ పొగే కాని మంటలేదు.— ఇంట్లో ఎక్కడా ఓ విసనకర్రలేదూ?" అన్నాడాయన కొంచెం విసుగుదలతో.

"లేకనేం? ఏమూలనో పడేస్తారు పిల్లలు, ఎక్కడి వస్తువు అక్కడ ఉండనివ్వరు."

"సమయానికి దొరకదు, ఏవస్తువైనా సరే యీ యింట్లో! మళ్లీ యింటినిండా ఉన్నారు ఇంతమంది. తిండికితప్ప మరిదేనికీ పనికిరారు. ఒళ్లువంగనితనం కాకపోతే, ఎవరికీ కనపడదా విసనకర్ర?"

ఇంతలో వెదురుగొట్టం తెచ్చి, "ఇదిగో యిదిదొరికింది" అని చేతికిచ్చాను నేను.

అందుకొని, "ఇదా తెమ్మన్నాను నిన్ను? ఇదెందుకు నీ నెత్తి మీదికి?" అంటూ కోపంతో నేల మీద విసిరి కొట్టేడు.

గొట్టం పగిలి రెండు చెక్కలయింది.

ఈలోపున నరసు వెళ్లి, ఎట్లాగో అవస్థపడి పొయ్యి మంట చేసింది.

"పొయ్యి మండుతూ ఉంది, నాన్నా," అని వచ్చి చెప్పింది.

ఆ మాటతో అతని కోపం కొంత చల్లారినట్లు కనబడింది. మరేమీ అనకుండా వంటింట్లోకి వెళ్లి పోయినాడు.

ఇంతలో నౌఖరీ పిల్ల నాగు వచ్చి నాతో, "ఇదిగోనండి అబ్బాయిగారు, యిసనకర్ర—అగదిలో కానొచ్చింది" అన్నది.

అది పుచ్చుకొని మా మామ కిద్దామని వెళ్ళాను నేను.

ఈలోపునే కేక వేస్తున్నాడాయన.

"ఇక్కడ మంచినీళ్ళబిందెమీద ఉందర్రా విసనకర్ర! మరి వెతక నక్కరలేదు. ఏడాదిదాకా వెదికినా ఎదురుగా ఉన్నవస్తువుకూడా కనపడదు మీ కళ్ళకి!"

"ఇదిగో దొరికింది మామా మరొకటి" అన్నాను నేను.

"ఇప్పుడు దొరుకుతాయి ఎన్నయినా — అవసరం తీరిపోయిన వెనకాల" అన్నాడాయన గుర్రుతూ.

వంట ప్రారంభమైనది మొదలు మా మామకు ఇదీ అదీ అందించడంతో సరిపోయింది నా పని. ఈ గిన్నె తెమ్మనీ, అగరొబె ఎక్కడుందో చూడమనీ, పప్పు డబ్బా ఎక్కడ పెట్టిందో అత్తను వెళ్లి కనుక్కో మనీ—యిలా నిమిషనిమిషానికీ ఏదో ఒకటి పురమాయిస్తూ ఉండేవాడు. నరసు కూరలు తరుగుతూ ఉంది,—తద్దినం వంటకి సరిపోయి నన్ని!

"అమ్మా, అదొండకాయలు అట్లా తరిగితే ఎన్నాళ్లకవుతుంది నీ పని? అలా కాదు. ఆపి తరిగే మోస్తరు నేను చెప్తాను ఉండు" అంటూ దాని వద్ద నుంచి కత్తిపీట తీసుకొని, తనో రెండు కాయలు తరిగి చూపించాడు మా మామ.

చప్పు చప్పున తరగడంలో జిగురుగా ఉన్న ఒక కాయ ఆయన చేతిలో నుంచి జారిపోయింది. కుడిచేతి బొటనవ్రేలు కత్తి పీటకు అని కొంచెం తెగింది.

"చెయ్యికోసుకున్నారు నాన్నా! రక్తం కారుతూ ఉంది" అన్నాది నరసు బిక్కమొగంతో.

"ఫరవా లేదులే — కాని తరిగే మోస్తరది! తెలిసిందా?......రామం, వెళ్ళి తమలపాకులడబ్బాలోది కాస్తసున్నం తీసుకురా; వేలుకి పెట్టాలి" అన్నాడు.

ఆవేళ వంటకు శకునాలన్నీ ఒక్కమోస్తరుగానే పరిణమించాయి. పప్పు కూర చెరో పెడమీద ఉడకవేశాడు మామ. మొదట మండడంలో పొయ్యి కొంచెం అవస్థ పెట్టినా క్రమంగా బాగానే అంటుకుంది. ఎంతపొగలేచినా కొంతమంట కూడా తగిలేది గిన్నెలకు. అరగంట అయిందిపొయ్యి మీదగిన్నె లెక్కించి. కాని ఎప్పటికీ ఆకూర;పప్పు ఉడికి మెత్తపడే ధోరణిలో లేనట్లు తోచింది మా మామకు. గరిటెతో వాటిని అడుగడుగుకీ కెల్లించి

కలుపుతాడు. పొయ్యిలో కర్రలు పడే పకే ఎగసనతోస్తాడు. తనలో తాను ఏమేమో గొణుగుకుంటాడు చికాకుతో, అప్పుడప్పుడు గరిటెతో యెత్తి ఒక కూరముక్కను వేళ్లతో నొక్కి చూస్తూ ఉంటాడు. ఎప్పటికీ ఆకూరముక్కలు మెత్తగిల్లక పోవడం సరేకదా, మీదుమిక్కిలి ఉడికిన కొద్దీ గట్టిపడుతున్నాయా అని సందేహిస్తాడు.

కూరపరీక్షలో చివరకు చెయ్యి చురికించుకొని; వేళ్లు ఊదుకుంటూ సావిట్లోకి వెళ్ళి గడియారం చూచాడు. “ఏమండీ అప్పుడే టైమ్ చూస్తున్నారు—వంట ఎంతవరకు వచ్చిందేమిటి?” అని ప్రశ్నించింది మా అత్త.

“ఉండవే—శాధవవంట! చెయ్యి కాలి పొక్కిపోయింది!”

“అయ్యో ఎట్లా కాలిం దేమిటి? గంజిపడిందా? ఏదీ చూడనీండి”—అంటూ ఒక అడుగు ముందుకు వచ్చింది మా అత్త.

“లేదులే—కాని ఆకూర పప్పు ఒకంతట ఉడకవేం? కొంచెం సోడాగుండ వేద్దునా చప్పున మెత్తపడతాయేమో?” అన్నాడు మా మామ.

“సోడాగుండ ఎందుకండీ, గుణుపురం కంది పప్పుకి? వెన్నవలె ఉడుకుతుంది ఐదు నిమిషాలలో!”

“నీ మొహం! ఇప్పటికి అరగంటకు పైగా అయింది ఉడకవేసి. వేసిన పప్పు వేసి నట్లే ఉంది, రాళ్ళ లాగు.”

“ముందే ఉప్పు వెయ్యలేదు కద కొంప దీసి?”

“ఆ మాత్రం తెలియదనుకున్నావా యేమిటి?”

“అయితే ఉడక్క పోవడ మేమిటి చెప్మా!” అంటూ క్షణం ఆలోచించి, “మంచి నీళ్లేపెట్టేరా, ఎసరుకి?”అని అడిగింది మా అత్త.

“ఏమో సుమా, మరి! ఆ బ్రాహ్మడు బిందెలతో నీళ్లుంచా డక్కడ తీనె మీద. ఏవి మంచి నీళ్లో ఎవడు శోధించేడు—ఆపాగలో?”

“మంచినీళ్ళయితే యిప్పుడే తెచ్చిపోశాడుగనుక, కొంచెం బురదగా కౌనరావండీ? మీరుఉప్పునీళ్లే పోసిఉంటారు; పొరపాటున?”

“అయితే మాత్రం కొంచెం ఆలస్యంగానైనా ఉడకాలా; లేదా?

“ఈసత్రంనూతి నీళ్ళతో ఏదీ తిన్నగా ఉడకదు—పాడునీళ్ళు. అందులోనూ; వేచిన కందిపప్పు అయితే యిక అడిగే దేమిటి?...ఇంకా కూరమాట చెప్పకండి; ఏదో ఒకమోస్తరుగా ఉడుకుతుంది.”అన్నాది మా అత్త.

“ఆకూర కూడా అలాగే యేడుస్తూ ఉందిగా! మంటబాగా తగులుతూ ఉంది గనక; యీ పాటికి ఉడికి ఉండదా అనుకొని మొదట చూడకుండా ఆనీళ్ళు వార్చేసి; యింత చింతపండు పులుసు; ఉప్పు; పసుపు తగలేశాను అందులో. ఆపులుసు; ఉప్పూ ఇగిరి పోయాయి కాని; ఆకూర మెత్తపడదు!”

“ఏం కూర అది?”

“దొండకాయలు”

“అలా చెప్పండి!” అంటూ మెల్లగా నవ్వింది మా అత్త. “అసలు దొండకాయలు ఉడకడమే ఆలస్యం. అందుకు తోడు మీరు పులుసుకూడా పోశామంటున్నారు. పులుసు వేసి ఉడికిస్తే కొన్ని కూరలు ఉడకవు. ఏకూరైనా ఉడుకుతుంది కాని దొండకాయ మాత్రం ఉడకదు—రోజల్లా ఉడికించినాసరే!”

“అలాగా?...అయితే ఇప్పుడు కర్తవ్యమేమిటి? ఏం జెయ్యమనీ నీసలహా” అన్నాడు మా మామ. మా అత్తకుకూడా యేమీ పాలుపోలేదు కాబోలు ఇద్దరూ మొగాలుచూసుకొని వెర్రిగా నవ్వుకున్నారు.

ఇంతలో గోవిందనామాలో యేవో శ్లోకాలో మెల్లిగా జపించుకుంటూ ఒకచేత దేవుడి ప్రసాదం కాబోలు ఒకకొబ్బరిచిప్ప రెండరటిపళ్ళు పట్టుకొని రెండో చేయి నడ్డిమీద ఆనుకొని, సన్నని మడిపొత్తి

పంచతో వచ్చి ఎదురుగా నిల్చుంది గున్నమ్మ అవ్వ! కోవెలకు వెళ్ళివస్తూ ఓసారి మమ్మల్ని చూసి పోదామని ఊరికనే వచ్చినట్లుంది ముసల్ది. కాని నా ప్రాణానికి అప్పుడావిడే సాక్షాత్కరించినవరదేవత వలె కనబడింది!

మడితో ఉన్న మా మామను ఎడంగా నిల్చున్న మా అత్తను అట్టే చూసి, సంగతి గ్రహించుకొని, "ఎప్పుడేమిటి!" అన్నాది ఆమె.

"ఈ ఉదయమే," అన్నాది మా అత్త ముసిముసిగా నవ్వుతూ.

"అయితే నాకు కాస్త కబురుచెయ్యలేకపోయినావే!... బాగుంది, మీరూ మీ మొగనూటమున్నూ. ఎవరైనా వింటే నవ్వుతారు......పోనీ, నయమే అయింది నే నిప్పుడు రావడం—" అంటూ తన చేతిలో ప్రసాదం పిల్లలందర్నీ దగ్గిరికి పిల్చి పంచింది.

చనువుతో మీదికి చేతులు చాపుకొంటూ వచ్చిన చంటి వాడిని ఒకమాటు ఎత్తుకొని, "దిగునాయినా,—పొద్దెక్కి పోయింది,—చప్పున నీకు బువ్వ వండి పెట్టొద్దూ మరి!" అంటూ తిన్నగా వంటింటి వైపు నడిచిందామె.

"అవ్వగారూ; మిమ్మల్ని శ్రమపెట్టకూడదనుకున్నాం యీవాళ. కాని దేవుడులాగ వచ్చారు సమయానికి" అన్నాడు మా మామ.

మా అత్త నవ్వింది.

# సువర్ణలతిక

నోరి నరసింహశాస్త్రి

నీ వొక సువర్ణలతికవు నిండునూత్న
యౌవనము తొంగిచూచు నీ యంగకముల
నన్ను భ్రమపెట్టి మోహింప నాక జనులు
పంపిన మనోహరాప్సరో వనిత వీవు!

వెన్నెలలలోని చల్లని వెలుగు వోలె
చిగురుటాకుల తరళమాంజిష్ఠ మట్లు
వెలయు నీతనుయష్టి నిర్వేల మగుచు
పూర్ణలావణ్య పీయూషపూర మెపుడు.

నీ విమల చారుమూర్తి వర్ణింప నన్ను
వందిగా నుండనిమ్ము నీ ప్రాంగణమున
కూర్తు నుపమింప వరవస్తుకోటి నీకు
అతిశయోక్తి స్వభావోక్తి యగుచు దనర.

# భారత జనయిత్రి

[ఆకలి నుండి]

నీ చరణ తరుణ లా
క్షా చిత్రితము లమ్మ
నీ సుతుల జీవితములు !
నా తల్లి,
నిరుపేద జీవితములు !!

ఈ బ్రతుకులే తెఱచి
యెగయు మా కోర్కెలె
సాఁగు సందె హారంగులా !
నా తల్లి,
రేఁగు పొడుపు వెలుంగులా !!

మన్ను మిన్నే యులమి
మసలు నీ వన్నియలె
మలయు హిమ మకుట ఘృణుల !
నా తల్లి,
మఱుఁగు సాగరపు మణుల !!

ముల్లోకపుం దెరువు
లల్లు నీ రాగములె
నిలుచు నమరుల యెడఁదల !
నా తల్లి,
కలఁచు నసురుల బ్రతుకుల !!

ఈ కాంతి నెఱుఁగుదురు
ఎల్లనాడుల వారు
నీ యడుగు పారాణిగా !
నా తల్లి,
నిన్ను లోకపు రాణిగా !!

నీ కరుణ కెఱుఁగుదురు
నీ పద్మముల కొసలఁ
దమ తలలు కుసుమాళిగా !
నా తల్లి,
తమ యెదలు నివ్వాళిగా !!

# నవ్యకవిత్వము

## దాని ఉద్దేశ్యము

నోరి నరసింహశాస్త్రి

"పురాణమిత్యేవ నసాధు సర్వం
నచాపి కావ్యం నవ మిత్యవద్యమ్"

నవ్యకవిత్వము అనే పదము నేటికాలములో కొందరు 'భావకవిత్వ' మనీ 'ఆధునికకవిత్వ' మనీ అసంపూర్ణముగా వర్ణించే మరింకా ఎన్నో పేర్లతోనూ వ్యవహరిస్తున్న తెలుగుకవిత్వాన్ని ఉద్దేశించి ప్రయోగిస్తున్నాము. ఈశబ్దప్రయోగంలో కూడా పెద్దలు లోపాలు చూపవచ్చును. "ఈ కాలపుకవిత్వంలో నూతనత్వము దేనిలో ఉన్నది?" అని అజీర్ణవ్యాధి కల వాళ్లు ప్రశ్నించవచ్చును. దంపతులకు కొత్తగా కుమార్తె పుట్టిన దంటే తల్లిదండ్రులలో లేనిది ఈ పిల్లలో కొత్త ఏమి వచ్చినది! చర్మమా, నెత్తురా, ఎముకలా! అని ప్రశ్నించేవాళ్లుంటారు. వాళ్ళకు జబాబు చెప్పలేము. ఈ లోకంలో చిత్రమేమంటే పాతదే మళ్ళీ మళ్ళీ కొత్త కొత్తగా కనబడుతూ ఉంటుంది. అటువంటి నూతనత్వమే ఈ కాలపు తెలుగుకవిత్వములో కూడా ఉన్నది. అదేమిటి?

ఈకాలములోకూడా ప్రబంధాలు పూర్వపు ఫక్కీని వ్రాస్తున్నారు. పురాణాలు తెలిగిస్తున్నారు. ఇప్పుడుకూడా కొత్త కొత్త జంగంకథలూ, పదాలూ, పాటలూ అక్షరాస్యులు కానివారు ప్రచారంలోకి తెస్తున్నారు. ఐతే వాటిని వేటినీ నవ్యకవిత్వ మనము. అవి వ్రాసినవాళ్ళుకూడా ఆధునికులైనా అది ఆధునికకవిత్వ మనిపించుకోదు. వాటిని భావకవిత్వమూ అనము. అయితే నవ్యకవిత్వ మేమిటి? ఈప్రశ్నకు ఒక్క మాటలో జబాబు చెప్పలేము. ఏవస్తువును ఉద్దేశించి ఈపదము ప్రయోగిస్తున్నామో లోకసామాన్యానికి తెలుసును. పదాలన్నీ సంజ్ఞలు. ఈ సంజ్ఞవల్ల వస్తువు ద్యోతమవుతే చాలు. ఐతే ఇప్పటికే లోకంలో ప్రచారంలో ఇతరసంజ్ఞ లుండగా ఇంకొక సంజ్ఞ ఎందుకు అని అడగవచ్చును. ఇది కొత్తమాట కాదు; పాతదే. అదిగాక ఆధునిక కవిత్వ మంటే ఇప్పటివాళ్ళు వ్రాసే కవిత్వ మంతా అని అతివ్యాప్తమై ఉంటుంది. ఇక 'భావకవిత్వ' మనే పదము కథానకాదిరూపమైన నవ్యకవిత్వానికి అన్వయించక అవ్యాప్తిదోషముతో బాధపడుతుంది. అదిగాక పండితులమనుకొనేవాళ్ళ ప్రసాదమువల్ల భావకవిత్వ మనే మాటకు

అర్థములేని పనికిమాలిన ఉల్లాయి పదాలని ఒక కొత్త అర్థం కూడా లోకంలో ప్రచారములోనికి వచ్చింది. ఉత్కృష్టమనే పదము మనముసలమ్మలనోళ్ళ 'ఉత్కృష్టపు బతుకు బతుకుతున్నాను'అనే వాక్యాలలోకి వచ్చినట్లుభావకవిత్వమనేపదానికి ఈఅర్థము వచ్చింది. ఈరెండుపదాలకు ఉన్నదోషాలు లేవని 'నవ్యకవిత్వ' మనే సంజ్ఞతో వ్యవహరిస్తునాము. పెద్దలకు ఇందులోకూడ లోపాలు కనబడితే ఈపద మంటే మాకు అభిమానమని చివరకు మేమనగలమాట.

ఈనవ్యకవిత్వము ఎప్పుడు ప్రారంభించింది? విజయనగరంలో ౧౯౧౧ వ సంవత్సరంలో ఆంధ్రసాహిత్యసంఘముస్థాపించడమే నవ్యసాహిత్యారంభంగా ఎంచుకోవచ్చు నని రావుసాహెబు మహోపాధ్యాయ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు ఒకసారి సెలవిచ్చినారు. గురజాడ అప్పారావుగారు, కిళాంబి రామానుజాచార్యులుగారు, బుర్రా శేషగిరిరావుగారు, రామమూర్తి పంతులుగారు మొదలయినవారు ఆ సమాజానికి ప్రతిష్ఠాపకులు. అప్పారావుగారి నీలగిరిపాటలు, ముత్యాలసరాలు కొత్తపాతలకు మేలుకలయిక కూర్చిన నవ్యసాహిత్యపు తొలికృతులు. ౧౯౧౩ లో 'అభినవ కవితామండలి' అనే పేరుతో రాయప్రోలు సుబ్బారావుగారు తమకావ్యాలు ప్రచురించారు. ౧౯౧౪ ప్రాంతములో అబ్బూరి రామకృష్ణారావుగారు బసవరాజు అప్పారావుగారు నవ్యకవిత్వము ప్రచురించారు.

౧౯౧౪ లోనే మహాసంగ్రామము ప్రారంభమయి లోకాన్ని తారుమారు చేసింది. ఆ మహా సంగ్రామమే ఒక కొండగుర్తుగా ఎంచుకోవచ్చును. ౧౯౧౧కూడా కాదనటానికి వీలులేదు. ఇటువంటివాటిజన్మ మనుష్యులజన్మ వంటిది కాదు కనక జన్మదినము నిర్ధారణ చేయడము కష్టమే.

ఏది ఎట్లా ఉన్నా నవ్యకవిత్వము ఇప్పటికి పాతికేళ్ళు నిండీనిండని ఈడులో ఉన్నది. నన్నయభట్టారకుడి కాలంలో తెలుగుకవిత్వం ప్రారంభించిం దనుకొన్నా తెలుగు కవిత్వానికి తొమ్మిదివందలసంవత్సరాలకు పైగా వయస్సు ఉన్నది. ఇందులో పాతికేళ్ళు బహుస్వల్పము. తొమ్మిదివందలసంవత్సరాలలో పుట్టిన కవిత్వ మంతటితో ఈపాతికేళ్ళకవిత్వమూ పెట్టి తూస్తే సమానంగా తులతూగుతుందా? కాని ఈ తొమ్మిదివందల సంవత్సరాలకవిత్వములో చెదిరిఉన్న గుణాలు ఎన్నో ఈనవ్యకవిత్వంలో కూడిఉంటున్నవి. ఇది గొప్పవిశేషము.

నన్నయభట్టు రాజరాజు పురోహితుడు. తిక్కనసోమయాజి రాజరాజును ఆశ్రయించినాడు. పెద్దన రాయలఆస్థానకవి, పోతన్న తప్ప మనగొప్పకవు లందరూ సామాన్యముగా రాజులనూ సామంతులనూ దండనాథులనూ ఆశ్రయించినవారే. పోతన్నను రాజులే ఆశ్రయించినందువల్ల రాజాశ్రయము ఇంకొకవిధంగా ఆయనకూ కలిగింది.

రాజుల ఆశ్రియము విద్వత్తువల్లకాని సాధ్యముకాదు. ఒకవేళ సాధ్యమయినా విద్వత్తులేనిది ఎక్కువకాలము నిలవదు. అందువల్ల మనపూర్వకవులలో ప్రసిద్ధులందరూ విద్వాంసులు. విద్వాంసు లంటే వారికి సంస్కృతాంధ్రభాషలలో జ్ఞానమే కాకుండా శాస్త్రపరిచయముకూడా కొద్దో గొప్పో ఉండేది. అటువంటివారి పద్యాలలో దోషాలు అట్టే ఉండవు. శిల్పసంపద వారిసొమ్ము. పద్యంలో దోషమంటే ఇతరపండితులు చూపిపరిభవిస్తారు. శిల్పము లేకపోతే ఎవరూ మెచ్చుకోరు. ఈ విధంగా రాజాస్థానాలలో పండితకవుల చేతులలో తెలుగుకవిత్వం పడిపోయినందువల్ల వచ్చిన సద్గుణాలతోపాటు ఎన్నో లోపాలుకూడా దానికి ప్రాప్తించినవి. గుణాలే లోపాలుగాకూడా పరిణమించినవి. శిల్పము మీద వారికున్నదృష్టి ఆ కవులచేత నిర్జీవ ప్రతిమలను తరుచుగా సృష్టిచేయించేది. తీరికలేనిరాజులకు ఎప్పటి కప్పుడు వ్రాసిన భాగాలు వినిపించవలసివచ్చేది కాబోలు; ఒక్కొక్కఘట్టమయినా వినేఓపిక వారికి ఉండేదికాదేమో! అందువల్ల ప్రతిపద్యంలోనూ విశేషము కనబడవలసివచ్చింది. ఒళ్ళంతా సందులేకుండా సొమ్ములతో నింపినబొమ్మలవలె కొన్నికావ్యాలు తయారయినవి. చివరకు రానురాను అర్థజ్ఞానము లేని సామంతులను ఆశ్రయించినందువల్ల వారిమెప్పుకోసము శబ్దాలంకారాలే కావ్యాత్మగా పరిణమించినవి. చివరకు బంధకవిత్వమూ గర్భకవిత్వమూ ప్రచారములోకి వచ్చినవి. కవిత్వము అంటే భాషాజ్ఞానమున్నపండితుడు నోటితో చేసే గారడీ అయిపోయింది.

ఈవిధంగా పండితులకూ ధనికులకూ వినోదముకోసమూ విలాసముకొరకూ ఉపయోగపడుతున్న కవిత్వముతోపాటు మరొక విధమైన కవిత్వంకూడా దేశంలో ఇంతకాలమూ ఉంటూనే వచ్చింది. అయితే ఆకవిత్వము ఎక్కువభాగము పుస్తకాలలోకి ఎక్కలేదు. ఎక్కినకాస్తా దీర్ఘకాలము ప్రచారములో ఉండలేదు. పామరులను తాత్కాలికంగా ఆనందపెట్టడానికి ఇంకొక తెలిసీతెలియనివాడు ఉత్సాహాతిశయమువల్ల చెప్పినకవిత్వమది. ఇటువంటివి జంగంకథలూ, స్త్రీల పాటలూ పదాలూ. పండితారాధ్య చరిత్రములో తుమ్మెదపదములు, ప్రభాతపదములు, పర్వతపదములు. ఆనందపదములు, శంకరపదములు, నివాళిపదములు, వాలేశుపదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు, అని ఎన్నెన్నో విధాలపదాల ఉదాహరించినాడు. ఇటువంటివే శతకాలు దండకాలు, గద్యాలుకూడాను. పేదవాళ్ళలో మహాత్ములెందలో పుట్టి పేరులేకుండా కాలగర్భంలో అణగిపోతున్నట్టే పామరజనులకు పరమానందము కలిగిస్తూన్న ఆ వాఙ్మయము నశించిపోయింది, పోతున్నది. నాటకశాలలలో ఆడేనాటకాలకికంటే వీథులలో ఆడే యానాదిభాగవతం చూడడానికి

ఎక్కువమందిజనం ఈకాలములో కూడా వెళుతారు. బుర్రకథ బాగా చెప్పగలడని ప్రసిద్ధికెక్కిన దొడ్డవరపు వెంకటస్వామి శేపల్లెవంటి గ్రామమువస్తే కాంగ్రెసువారు సభలుచేసే ఊరిమధ్య మైదానము చాలక పోగా ఊరుబయట మైలుదూరాన ఉన్న మైదానానికి జనాన్నంతా పంపవలసివచ్చింది. అప్పుడు ఎంత బాగా చదివే మనిషి అయినా భారతము చదువుతానన్నట్లయితే ఆవచ్చినవాళ్ళలో ఒక్కపురుగైనా అక్కడఉండేది కాదు. అయితే బుర్రకథ ప్రారంభము కోసము అర్ధరాత్రి పన్నెండుగంటలదాకా అన్నివేళలజనమూ కాచుకొని ఉన్నారు.

ఈ విధముగా అపరిమితమైనజనాన్ని ఆ పాటలలోనూ పదాలలోనూ ఆకథలలోనూ ఆనందపెట్టుతున్న కవిత్వము కాదనలేము. అయితే దాని ఆకర్షణ పాటలలోకంటే పాడేవారిలోనూ కథలలోకంటె చెప్పేవారిలోనూ ఎక్కువ ఉంటుంది. ఆకవిత్వములో శిల్పములేని జీవ మున్నది. ఆ జీవము ఎవరైతే బాగా ప్రదర్శించగలరో అటువంటివారు నలుగురిమెప్పూ పొందుతారు.

ఈ తొమ్మిదివందల సంవత్సరాలబట్టీ ఈ రెండు సంప్రదాయాలూ ప్రత్యేకంగా వస్తూఉన్నవి .ఒకటి శిల్ప ప్రధానమైనదీ; ఇంకొకటి జీవప్రధానమైనదీ. శిల్పమున్న దానిలో జీవము తక్కువ. జీవ మున్న దానిలో శిల్పము తక్కువ; అందువల్ల మనదేశములో ఉత్తమోత్తమమైన కవిత్వము ఈ తొమ్మిదివందల సంవత్సరాలలోనూ పుట్టలేదు. ఆంధ్రాభిమానమువల్ల మన కవీశ్వరులను జగత్తులోని ఉత్తమకవులతో పోలిస్తే రసికజనబృందములో మనము హాస్యాస్పదుల మవుతాము.

ఈకాలములో విద్యాశాలలవల్ల విద్య జనసామాన్య మైపోతున్నది. కాబట్టి కవులు జీవించవలెనంటే ప్రధానముగా సామాన్య జనముమీద ఆధారపడవలెను. ఎవరయినా ధనికులనూ అల్పప్రభువులనూ ఆశ్రయించి ధనసంపాదన చేసినా ఆకవికీర్తి ఆఆస్థానము దాటి బయటికి పోదు. ఇట్టి సందర్భములో ఈకాలపుకవి విద్యాధికులకు తృప్తికలిగించే శిల్పమూ సామాన్యులను పరవశులనుచేసే ప్రాణమూ సంపాదించుకోవలె అంటే పూర్వపు రెండు సంప్రదాయాలలోని సద్గుణాలున్నూ అలవరుచుకోవలె. ఆ రెండు సంప్రదాయాలనూ సమన్వయముచేయవలె.

ఈ పాతికేళ్ళనుంచీ నవ్యకవులు చేస్తున్న ప్రయత్నమిదే. నవ్యకవులలో సామాన్యార్థముబట్టిచూస్తే విద్వాంసులు తక్కువమందే ఉంటారు. కాని వారిలో ఏదోవిధమైన సంస్కారంలేనివారుకూడా అరుదే. నవ్యకవులలో విలాసముకోసమూవినోదము కోసమూ కవిత్వముచెప్పేవారు ఉండరు. కవితోద్రేకము లేనిదీ వారు సామాన్యముగా వ్రాయరు. ఈ గుణమువల్లనే ఈ కవిత్వానికి భావకవిత్వ మనిపేరు ప్రచా

రములోకి వచ్చింది. కొందరిలో శిల్ప మెక్కువ; మరికొందరిలో జీవ మెక్కువ. కాని మొత్తముమీద అందరిలోనూ శిల్పమూ జీవమూ మిళితమై ఉంటున్నవి. నవ్యకవులకవిత్వములో శిల్పమూ లేదు జీవ మూ లేదు అనేవాళ్లు కూడా ఉండవచ్చును. అటువంటివాళ్లు ఉత్తమోత్తము లైన కవుల రచనలతో నవ్యకవులరచనలు పోల్చి చూస్తారు. అటువంటి ఉదాత్తమతుల అభిరుచులకు నవ్యకవులకవిత్వము తృప్తి కరముగా ఉండకపోవచ్చును. అట్టివారిని ఉద్దేశించి చెప్పినదికాదీకవిత్వము. కాళి దాసుకాలంలో కాళిదాసురచనలూ భవ భూతికాలంలో భవభూతిరచనలూ కూడా పనికిరా వన్నవాళ్లు ఉన్నట్లు కనబడుతుంది. ఇక నవ్యకవులసంగతి ఏమి చెప్పవలె?

నవ్యకవులు చేస్తున్న ఈప్రయత్నము కొత్తదికాదు. పూర్వముకూడా సోమనా థాదులైన శివకవులు ముఖ్యముగా ఈ రెండు సంప్రదాయాలనూ సమన్వయముచేసి కవి త్వము చెప్పవలె నని ప్రయత్నించినారు. వారికున్న వీరశైవమతావేశము వారికెంతో ఉత్సాహము కలిగించింది. అయితే వారిమ తావేశము శిల్పదృష్టిని మరుగుపరిచింది. రానురాను శివకవులకవిత్వ మంతా పామర జనసామాన్యమైన కవిత్వశాఖలో కలిసి అణగిపోయింది.

మునుపు శివకవులుచేసి విఫలమైన ప్రయ త్నమే నేడు నవ్యకవులు చేస్తున్నారు. నవ్యకవులకవిత్వములో కొన్నిచోట్ల నిర్జీవ త్వమూ నిరలంకృతీ కలిసి కనపడకుండా ఉండడము లేదు. కాని ప్రధానముగా జీవమూ శిల్పమూ సమన్వయమై కనబడు తున్నవి. ఇప్పటి కింకా ఆసమన్వయము పూర్తికాలే దంటే ఆవిధంగా పూర్తి అయినప్పుడే నవ్యకవుల కవిత్వాశయము నెరవేరుతుంది. 'శివకవులు' చేయలేకపోయిన పని 'నవ్యకవులు' సాధిస్తారా? నవ్యకవు లది సాధించలేకపోతే తెలుగుజాతి నిర్వీర్యమైన దనీ తెలుగువాణి నీరసమైనదనీ మరొక్క సారి ఋజువవుతుంది.

# నేటికి

**శివరాం**

మృడాని కంఠో
ద్ధృత హూంకారం
తెనుగు తల్లి తీ
యని యెలుగులకా !

హరు ఫాలాక్షి
స్ఫుర దగ్ని కణం
తెనుగు తండ్రి చ
ల్లని చూపులకా !

భూత పిశాచ
ప్రేత తాండవం
తెనుగు పాప చ
క్కని నడకలకా !

కళలు కవితలూ
కలకల్లాడే
తెలుగు నాటికా
ప్రళయం నేటికి !!

౧౮౯

# జనార్దనరాయ సంస్మృతి

## మల్లవరపు విశ్వేశ్వరరావు

ఓ కవిమానీ! అదృశ్య
లోకాశ్రిత సత్ప్రాణీ
ఓ జితమృత్యూ! స్మృతిగత
పూజితచారిత్ర! మిత్ర!

నీసుతీక్ష్ణరుద్రవీణ
నిశితసూక్ష్మ నిస్వనమ్ము
నాహృదార్ద్ర రక్తనాళ
నాళాస్త్రకణాల మ్రోగు !

నేటి సందె చీకటితెర
మాటున ఏ సడి రేపని
గాటపు నిట్టూరుపు లే
బాట రొదలా దరిసి యాగు !
ఓ కవిమానీ !

*

అది చీకటి నిశీథమో ?
అరుణోదయ ముహూర్తమో ?
శీతల మృత్యునిమంత్రణ
శిరసావహియించువేళ !

వెడదిల్లక, తడవొల్లక,
కడకోరిక నెడనిల్పక
వెడలితివో — బడలినావొ
అడవిదారి, కడలిమీరి !

పెనుచీకటి పరపారమె
వరియించితివో, పరమే
శ్వరవాణికి నోడబడి, న
శ్వరధారుణి చెరయని విడి !
ఓ కవిమానీ !

*

ఆర్జించిన మన సౌహృది
వర్జించితివేలో ? త
న్నిర్జరసాంగత్యావృత
నిరసింతువో నరసంగతి ?

నవవాసంతవిలాసము,
భువనానందోల్లాసము,
సురసీమా పరవాసము
సరి రావో మోక్షరాగి ?

నరజీవిత సరసాత్మక
పరిణామ మ్మిల గాదో ?
పరివంచిత వరయౌవన !
విరసాత్మా! మృత్యుభోగి !
ఓ కవిమానీ !

# కాత్యాయని

## అడ్డేపల్లి నాగగోపాలరావు

"పుట్టుపండుగలు" తెలుగువారికి క్రొత్తవి కావు. అయినా పబ్బాలు కబ్బాలుగా వెలువడడానికి బహుశః ప్రథమ మిదేనేమో! శ్రీ బొడ్డు బాపిరాజుగారి చిన్నారికన్నియ ప్రథమ జన్మదినోత్సవమునాటి ఆనందానురాగాలు కాత్యాయనీ కావ్యస్వరూపము దాల్చినవి.

'దువారము'లో కవి 'ఈ రోజు జగత్తుకు మామూలు పర్వమే అయినా మా పట్ల మాత్రం అతిశాయి' అని సత్యాన్ని వచించినాడు. అసలు కృతిపుట్టువుకే కాత్యాయనీమందహాసరేఖ కారణమని ప్రగాఢ సుతావాత్సల్యాన్ని ప్రకటించుకొన్నాడు. కవిహృదయంలో పొంగి పొరలిన కావ్య తరంగిణిలో కాత్యాయని ఒకచిన్ని కెరటము.

శ్రీ బాపిరాజుగారు ఆంధ్రలోకానికి సుపరిచితులు. వీరి తొలికావ్యము "విపంచి." అది ప్రబంధధోరణిలో నడచిన ఖండిక. భాషావిషయములో కాత్యాయనికీ విపంచికి భేదం చాలాఉన్నది. అది గండశిల, ఇది వెన్నముద్ద. వస్తువుకు తగిన శైలి ప్రయోగించకపోతే ఎంతటి పెద్ద కవిత్వం అయినా పాఠకుని మనస్సు కెక్కదు. చిన్ని పాపను గూర్చి వ్రాసేటప్పుడు భాష తదుచితంగానే ఉండాలి. ఆవిషయములో కాత్యాయని తగిన 'న్యాయం' పాటించినది.

కావ్యసామగ్రి కాత్యాయని బాల్య చేష్టా పరంపర. తల్లిదండ్రులకు పరమేశ్వరీ ప్రసాదము 'కాత్యాయనీదేవి;' ఆంధ్రపాఠక లోకానికి కవి ప్రసాదితమైన "సూడిద" యీ "కాత్యాయని."

నాంది:

అమ్మ పుట్టినరోజు అవతరించింది
తల్లి పుట్టినగడియ తరలివచ్చింది.

అప్పుడు కవికుమారునికి—

చందమామనుగన్న సంద్రమ్మువోలె,
వుప్పొంగె చిత్తమ్ము వుత్సాహలహరి.

ఇదిసహజము. తన కన్నకుమారుని నిండుదనము గన్న సముద్రము సంతోషముచే పొంగి తరంగలాస్యము చేయటం లోకప్రసిద్ధము! నిజపుత్రికను జూచిన కవి మనస్సు ఆరీతినే ఉప్పొంగి పోవడం ఉచితము. ఈరచన మనోహరము.

తల్లిదండ్రులకు బాసరాని బిడ్డలకు గల ప్రేమబంధ మేమోగాని

పాపాయి! యన్నంతపైకి చేయిచాపి
ఎత్తుకొమ్మని యురక తత్తరిల్లేటి
అమ్మడూ! నీకు మాయనురాగబలము
తోడునీడై యుండు మూడు వేళలను

అని బాపిరాజు ప్రతిదినం మనం చూసే విషయాన్ని విశదపరచినాడు.

సాధారణంగా చంటి పిల్లలకళ్ళు చాలా అందంగా ఉంటవి. కన్నతండ్రి దృష్టికి:

అమ్మణ్ణి కన్నుల్లు తమ్మిపువ్వుల్లు
తమ్మిపువ్వుల్లోని కమ్మ తేనెల్లు

కనుపిస్తవి.

చిన్నారికళ్ళల్లో కన్నీటిజల్లు
కన్నీటి జల్లుకే కరగు నెడదల్లు.

ఇది యథార్థము. చిన్నిపాపల కన్నీటి కణానికి కరగి నీరుకాని కరకు ఎడద ఉండ నేరదుకదా!

చక్కన్ని తల్లులు గుక్కపట్టినప్పుడు చెక్కుటద్దాలు కెంపెక్కి సంజ చెదరినట్లు గుప్పించడం సంతానవంతులైన దంపతులకు యెరుక లోనే.

చక్కన్ని నాతల్లి గుక్కపట్టింది
చెక్కుటద్దాలలో చెదరెనే సంజ
చల్లన్ని గాలి! మా చంటిపాపాయి
వాళ్ళార్చి శ్రమదీర్చవోయి రవ్వంత

అని శీతలానిలాన్ని ప్రార్థించేరీతి చూడండి ఎంతచక్కగావుందో! పాపాయి పైనున్న వాత్సల్యబలం పవమానుని మానవుని గావించి సేవకుని జేస్తుంది చిట్టితల్లికి.

అలసిసొలసినవారికి ఆనందదాయకుడు అమృతాంశుమూర్తి. అందుకని

కన్నబిడ్డ మోము కందిపోయింది
చిన్ని వెన్నెలదొరా! చిందు చలువల్లు
అలసిపోయిన చిన్ని నాడించవోయి!
నలిగిపోయిన కన్న నవ్వించవోయి!

అని పలికినాడు కావ్యకర్త, తన ఊహాలను మనుష్యలోకపుటంచులను దాటిస్తూ.

దొరవెన్నెల్లోన దోబూచులాడు
కారుమబ్బుల్లేమొ కన్నెముంగురులు!
చంటికీముంగుర్లు చక్కన్న తరుగు
యింటికీ చిట్టెమ్మ యే పొద్దు వెలుగు

అన్న గీతిక చదివేటప్పుడు 'బాలేందురేఖ దోచిన లాలితమగు నపరదిక్కులాగున ధరణీపాలుని గేహము మెరసె'నసే భాగవత పద్యము మనోవీధిలో తోచకమానదు. అదే "పొద్దువెలుగు" అన్నాడు బాపిరాజు.

శిశువు పుట్టీ పుట్టకముందే పెళ్లి బేరాలు వియ్యాలు కయ్యాలు కట్నాలు కానుకల సంబరాలు తెలుగయ్యలకూ అమ్మలకూ చేతఃప్రీతిదాలు. అందుకు బాపిరాజుకూడా అపవాదంకాదు. అందుకనే 'పెళ్లిమాటలు' వ్రాసుకొన్నాడు. కాత్యాయనీదేవి కరుణవల్ల సుపుత్రి ఉదయించింది. దంపతుల 'చివికినబ్రదుకేను' చివురించింది. మళ్లీ 'మ్రోడైనచిత్తాలు మోసులెత్తాయి' 'పుత్రశోకాగ్నిలో పొరలేటి' యీ కవకు

'పీయూషవృష్టి' యీ 'ఫిన్నాడుబడుచు' అంతేకాదు. కవి యెంతవరకు ఆనందంలో మునిగిపోయాడో చూడండి.

శ్రీగారి దేవి మా చింత లడియార్ప
అమ్మాయిగాపునా అవతారమెత్తె

అంటున్నాడు. అక్కడా ఆగడు శంకరునకు కబురుచేస్తాడు. ఎలాగు?

ఎక్క డున్నావోయి వెర్రిశంకరుడ
వృంగాయి నీకొరకు బెంగపడివుంది
పాలేనితాగ్రవదూ పట్టుపట్టింది
జోల పాటలు వింటు సోలబో దింత
ఆలించరావోయి, పాలించరమ్మ
ఆలించి పాలించి ఆదరిం చేవ?
అమ్మన్న నిచ్చేము అల్లుడా! నీకు
కాదనక చేపట్టి కనికరించాలి.

అని కన్యాదాతకు ఉండే సహజ వినయంతో సంప్రార్థిస్తాడు.

కోమటి బిడ్డకదూ! ధనికుడే అయినా చూడండి అల్లుడికి కట్నం ఏమి ఇస్తా నంటున్నాడో! బికారి శంకరునకు పెళ్లిమురిపెం, పిల్లమురిపెమే కాని, ధనాశ లేదని తాత్పర్యమేమో! కాకుంటే, ఈరోజుల్లో శంకరుడైతేనేం కింకరుడయితేనేం కట్నం కోరని పెళ్లికొడుకు ఉంటాడా అని

కన్నె లేనవ్వులే కట్నాలు సుమ్మీ
లల్లమ్మ చూపులే లాంఛనాలన్ని.

కట్నమీయనివాళ్లుసహితం పట్టు వస్త్రిదులిస్తారు. ఇతగా డదీ ఇయ్యడట—

చిట్టమ్మ కౌగిళ్లె పట్టు వస్త్రీలు
పిల్లదే పదివేలు పెట్టు పోతల్లు

పెట్టు పోతల కన్నిటికీ సున్నా జుట్టి పిల్లదే పదివే లనుకోమ్మంటూ పై పెచ్చు

సవతులందరిలోన చంటి నెక్కుడుగ
మన్నించి చూడాలి మాతోడు సుమ్మీ!

అనిఉత్తుత్తవినయాలుకురిపించుతాడు. మంచి బేరమే ఇదిరావోయి! శంకరుడ! రమ్మి వేగమ్మి.

చుట్టపక్కాలతో శుభలగ్నమందు
తరలిరావ చ్చింక పరమేశ్వరుండ!
పెళ్ళిపనుల్ తలపెట్టేము మేము
మాట తప్పుటలేదు మనువునిశ్చయము!

బలేహుకుం! ఈరచన చిత్తాకర్షణీయంగాను నైసర్గికంగానూ ఉన్నది.

"చంటియెవ్వరి చంక కెక్కునో"
యంటు పంతాలాడుకొనగా
తల్లిదండ్రులతగవు వింటూ
పిల్ల సవ్వుకొనుగ.

అనే ముత్యాలసరం ఒకటీతప్ప 'ఉబుసు' లనే ఖండిక రసవంతంకాదు. వట్టి ఉబుసుపోకకే అన్నట్టు కనిపిస్తుంది.

ఈగేయసంపుటిలో "చందమామ" అనేది మకుటం. చంద్రుణ్ణి చూచీ చూడగానే సహజంగా ఉబికే అర్థంకాని శైశవానందాన్ని, ముద్దుముద్దుగా మబ్బు తునకల్లో దోబూచులాడే చందమామ నీ కావ్యరూ

వంలో మనోహరంగాచిత్రించాడు రచయిత.
మచ్చుకొకటి రెండు చరణాలు:

దూరాన కొండల్లో దోబూచు లాడేటి
నీలైనచిన్నోడ! నిన్నె 'దా!దా!' యంచు
కేలెత్తి పిల్చేనురా
పాపాయి
వేలెత్తి చూపేనురా
'చందమామా రావె! జాబిల్లిరావె!' యం
చందాల మాచిట్టి యాడినందులకయిన
కొండదిగి రాగూడదో
పాపాయి
నండ నీతో నాడదో!

చిట్టితల్లి 'రూపురేకలు' తీర్చిన శబ్ద చిత్రం. నయనానంద దాయకము. పరికింపుడు

చిన్నిరోజాపూలు చిన్ని చెక్కిళ్ళు
చెక్కిళ్ళపై వాలి చెరలాడు నవ్వు.
జాబిల్లి కందాలు చేబదులునిచ్చు
మాబుల్లి తల్లి గారాబు నెమ్మొగము.
సొగముక్కున కీడుజోడౌను కొంత
చందమ్ముసవరింప మందారకళిక
కొత్రిన్నెలకవ్వించు నెన్నుదురుకుదురు
చిలిపికన్నులు ముద్దులొలుకు పెదవులును
వెన్నముద్దాతోటి వన్నెకూర్చినదో
సుదతి దేహమ్మెల్ల చూడచక్కనిది.

ఇంత యెందుకు ?

ఉన్నన్నియందాలు వొక్కటిగ జేసి
పోతపోసినపైడిబొమ్మ కన్నమ్మ.

అంతేకాదు.

తేయెండకే తాళలేని సుకుమారి
అమ్మాయి ముత్యాని కలిసున్ని తమ్ము

అని వర్ణన మాపినాడు. ఈఆపుదల ఇంకా ప్రశంసింపలేకాకాదు, అమ్మాయి అందం పూర్తిగా అచ్చుగుద్దినట్టు చెప్పాననీ కాదు. మరి దేనికి ?

తెగచెప్ప తగులునో దృష్టిదోషమ్ము
కమ్మని నాకైత కందునో యేమొ !

అని కవి అనుమానపడి ఆగిపోయినా డంతలో. ఇంతకుమించి చెప్పిన అత్యుక్తి దోషముకూడా ఆవహిల్లి రసభంజక మవు తుందేమో! ఔచితిని పాటించడం అవ లోకనార్హము, హర్షదాయకము. ఈశీర్షిక ముత్యాని కలిసున్నితము!

అన్నప్రాశనోత్సవము 'పరీక్ష' అనే పేరున ఉన్నది. ఒకచోట తావులుచల్లేపూవులు, వేరొకచోట కుంకుమాది మంగళద్రవ్యాలు, ఇంకా ఇంకా యితరాలు ఉంచిన పళ్ళె రాలతో పరీక్ష ప్రారంభమయింది. క్రొత్త దుస్తులతో ముస్తాబయిన కాత్యాయని పరీక్షకు కూర్చున్నది. బంధుగురు జనులు పరీక్షకులు.

ఆవాహన :

రంగవల్లికల సింగారించిన
బంగరు పీఠముపై నిడినారలు
యెల్లవస్తువులు అల్లవిగో, యవె!
చల్లగరావే! తల్లీ రావే!

వేకువవిడ్డా విరులు గులాబులు
సోకిన కందే సొగసుల జాదులు
మందారమ్ములు మధురగంధముల
నందించెడినీ కల్లన రావే!

అని చిట్టి తల్లిని పిలిచి,

కమ్మని కావ్యము లిమ్మగు వాద్యము
లుంచిరి చిత్రము లెంచుకొనగదే
ముద్దరాల! నీ విద్దెలు మెచ్చే
ముద్దుమగనికే ముడి వెట్టేమే.

అని మురిపించి, చుట్టుపక్కల మూగిన చుట్టప్రక్కాలను చూస్తూ కాలూచేయీ ఆడించాక ముసిముసినవ్వులు నవ్వే చిట్టితో తెచ్చుకోలు కోపాన.

మంకు పట్టటే మాటలు వినవా?
కుంకుమ భరిణను కోరిముట్టవే!
చెలి! నెన్నుదుటను కలకలలాడుచు
కలకాలమ్మును గ్రాలును తిలకము!

అని సలహా ఇస్తూ ఆత్మీయాసక్తిని వెల్లడించుకొన్నాడు. మళ్ళీ అది న్యాయము కాదనే సంకోచాన్నో అనుశ్రితాచార బలమువల్లనో కించిత్ గంభీరముగా

ఇచ్చకు వచ్చిన దేదైన సరే
హెచ్చిన వేడుక నెన్నితీయవే
తలిరుగేలితో తొలుత నెత్తినది
పలుకును జీవిత భవిష్య మఖిలము

అనివాకొన్నాడు. ఆపైన సంశయనివారితుడైనజనకుడుసంతోషపారవశ్యానగొంతెత్తి

నెగ్గితివమ్మా! నెగ్గితివమ్మా!
నెగ్గితివమ్మా! నీపరీక్షలో
అయిదవతనమూ, అన్నివిద్యలూ
ఐశ్వర్యమ్మును అబ్బు నిశ్చయము!

అంటూ ఆనందగానమాలపించినాడు. కావ్య ప్రణీత కాంక్షించిన దదే! తనయజయమే తనఆనందం. ఇక "సర్వేషుబంధుషు మధుర వాగ్భవ."

అల్లన పెదవుల నద్దినట్టి పర
మాన్నములోపల నున్నతియ్యదన
మెల్లయెడల నీచల్లని పలుకున
యిల్లు గట్టుకొని యొసగుత బిడ్డా!

'సుప్రభాతం' 'నోమూ' సామాన్యాలు. 'పిల్ల పోకిళ్ళు' 'యెంకిముచ్చట్లు' చారలలో నడచినవి. శిష్టత అంతగాలేదు.

'కట్టుకత'లో పిల్లకు ప్రత్యేకంగావుండే గుణాలు నిరూపింపబడ్డాయి, రంగూరకమూ, బుద్ధీ సుద్దీ, తలపూ మెలపూ అన్నీని.
ఎత్తుగడ—

అనగనగ అమ్మాయీ
అలగులాబి రంగోయీ
చూడ చక్కనైనమచ్చు
వాడకెల్ల రంగుతెచ్చు.

వాడకు రంగుతెచ్చే చిన్నదాని చెలువు చూచి, ఒరులు చెలిమితో చెయిసాచి పిలిస్తే చంకకెక్కదా పాపాయి. అది గమనించక వారు పలుకరించారా తంటా తప్పదు. కన్నతండ్రి ముద్దుపిలుపులకు జననీ జనకుల యెత్తులకూ అలవడి సుంతయినా నేలమీద అడుగుపెట్టని ఈ చిన్నారి కన్నియ కింకొక్క గుణము.

పోరుపెట్టి యేడ్పు రోజు
పూరిలో షికారు మోజు
ఆడుకోదు పాడుకోదు
అల్లరుంటె చాలు పోదు.

బాలికకు నాగుమయ్యే ఆహారవిద్యలలో గురువు. పాప రేదు గాలితినేవాడు, నేర వాది. ఇక నీ చిన్ని పాప పాలు తాగదు. 'నోముపట్టిందేమో ఒట్టుపెట్టినట్లు వొక్క చుక్కేనా పాలుతాగదు. ఎంతపళ్ళు కోరికనా' అంటారు తల్లిదండ్రులు.

గాలితినీ బ్రదుక నేర్పు
కబురులతో తెల్ల వార్చు
కన్నె గురువు నాగుబాము
మున్నె చెప్పె చదువు సాము.

కలికికనుల దగాకోరు అయిన కాత్యాయనీ దేవీ ప్రత్యేకగుణ పరిశీలనము బాగున్నది. స్వస్తివాక్యములు చారుమోహానములు.

పరమ, మస్మత్సుతా ప్రభవకారణము
కాత్యాయనీదేవి కారుణ్యదృష్టి
అల్లారు ముద్దయిన అమ్మాయినెపుడు
తోడగని కనచమై కడిమి కాపాడు.

స్థల దైవతమ్ములు, జలదైవతములు
ఆకాశదేవతలు, అగ్ని దేవతలు
వనదేవతలు, ఎల్ల వరద దేవతలు
పిల్లబోత్తురు నిండు పేర్మి హామేష!

తథాస్తు!

"తొలిమెట్టెక్కిన యీ మా బిడ్డ కడమ తొంభై తొమ్మిదీ ఎక్కాలని పెద్దల దీవనలకు కొంగుసాచి యీ చిన్నిసూడిదను అందిస్తూవున్న" తల్లిదండ్రులకోర్కె ఫలించుగాక! చిరంజీవిని కాత్యాయనీ దేవి తరుగని సౌఖ్యంతో పెరిగిన సౌభాగ్యంతో తలిదండ్రుల కోర్కులతో వర్థిల్లా లని నా హృదయ పూర్వకమయిన ఆకాంక్ష!

నివాళి—

అమిత ప్రేమనిధాన మయ్యాచల
కన్యాదత్త దివ్యోపహా
రము, అస్మత్సుఖ పూర్ణజీవనకృతి
ప్రాణమ్ము, నిత్యానుభో
గ్య మహానంద రసస్వరూప మగు
మా కాత్యాయనీదేవి పా
దము లీకావ్య లతాంతసంతతికి
పెట్టున్ మాధురీ భిక్షముల్!

మొత్తమ్మీద శ్రీ బాపిరాజుగారి రచనలు మధురములు. పద్యములలోగల పదవ్యయము, క్లిష్టాన్వయము మచ్చునకయిన ఈ గేయములలో లేకపోవడం చేతనూ ముద్దులూరే జిలుగు పలుకుల కలగలుపులతో కులికించటంచేతనూ ఈ కావ్యం ఉత్తమంగా ఉన్నది.

# దీక్షిత దుహిత

[మూడు రంగముల పద్య నాటిక]

**శ్రీ శివశంకర శాస్త్రి**

*

**అంకితము**

శ్రీ విశ్వనాథ సత్యనారాయణకు

*

**= పాత్రలు =**

మంగళాంబ
చంద్రమౌళి
సరసవాణి
మరకతవల్లి
అప్పదీక్షితులు
చంద్రావతంసుడు

(CHORUS)

వృద్ధ బ్రాహ్మణ స్వరమేళ
యువ బ్రాహ్మణ స్వరమేళ
వితంతువుల స్వరమేళ
అజాత శిశు స్వరమేళ

కాలపరిమితి 80 గంటలు. రంగములు
అడయప్పల గ్రామములో అప్పదీక్షితులు భవనములో
క్రీ. శ. 1610 సంవత్సర ప్రాంతము

శివ

## ప్రథమ రంగము

[ఆరామములో సాయంకాలము వేదికపై గూరు చుండి చంద్రమౌళి పసుపుపచ్చని తాళపత్రమున ఘంటముతో వ్రాయుచుండును. ఇంతలో మెల్లగా నడచి వచ్చి అతనికి వెనుకవైపున కొంచెము సేపు నిలిచి]

== మంగళాంబ ==

తిరిగి చూడక యేకాగ్ర దృష్టితోడ
వ్రాయుచున్నావు శ్రీకంచి వరదరాజ
నుతియొ, శ్రీకృష్ణ ధ్యాన పద్ధతియొ, కాక
శిఖరిణీమాలయో యేదో చెప్పుమోయి!

== చంద్రమౌళి ==

[ఘంటమును గ్రంథమును వేదికపైనుంచి, ఆమెను తేరిపార జూచి మందహాసముతో]

హంసకమ్ములులేని నీయడుగుదోయి
అలికిడి రవంత లేక జలాశయమ్ము
నందు విహరించుచుండు రాయంచగమన
మనుకరించెను మంగళా, అందమందు!

== మంగళాంబ ==

అంచనడకల నే నరుదెంచి నట్లు
తిరిగి చూడనివానికి తెలియుటెట్లో?
ఉండవలె దివ్య దృష్టి, లేకుండు నేని
నీకు తలవెన్క కలదేమొ నేత్రయుగళి!

== చంద్రమౌళి ==

ముగ్ధహరిణాక్షి, నే చతుర్ముఖుడ గాను
సిద్ధుడను గాను దృష్టి విశేషమునకు...
బాల, నీ నిండుచక్కదనాల నడక
కనులు మూసిన, తెరచిన కానబడునె!

పసపు పారాణి అందియల్ పాదములకు
వైభవాపాదకమ్ములు, వదనమునకు
శోణ కుంకుమ తిలకమ్ము శోభ తెచ్చు;
మర్త్యధిని మంగళా, అన్నితోలగ నీకు!

== మంగళాంబ ==

తండ్రిగారు రచించిన స్తవము లన్ని
ఏకసంపుటిగా వ్రాసి యిత్తు నంటి,
వేమి లిఖియించుచుంటివో యింతకు మును
ఏది యొకసారి నన్ను వీక్షింపనిమ్ము.

== చంద్రమౌళి ==

ఎందులకు నీకు మంగళా, యీ దిదృక్ష?
గ్రంథము శివార్క మణిదీపికా ప్రతి సుమి
[గ్రంథమును వెనుక దాచిపెట్టును]

== మంగళాంబ ==

నీవు ఘంటమ్ముతోడ దానిమ్మగింజ
లట్టి రమ్యాక్షరాలు వ్రాయంగ నేర్తు,
విపుడు నీవు లిఖించెడి యీ యపూర్వ
తాళపత్రమ్ము జూడక తప్పదోయి!

== చంద్రమౌళి ==

పఠనయోగ్యము కా దిది, పట్టువిడిచి
వేగముగ నీ ప్రదేశమ్ము విడిచిపొమ్ము.

== మంగళాంబ ==

[ముఖము విచిత్రముగా త్రిప్పి]

పఠన యోగ్యము కాని దేపగిది నీవు
వ్రాయుచున్నావొ ప్రశ్నింపవచ్చు నొక్కొ?
అంతగోప్యమె యైనచో నడుగ నింక,
విసుగుగా నున్న పక్షాన వెడలిపోదు!

== చంద్రమౌళి ==

ఏటిమాటలు ముద్దియా, ఎన్నడేని
విసుగుకొన్నాన నీమీద, కసరినాన
మంగళా, నిన్ను? నేడు నామనను శాంతి
చెందలే దీముఖేందు వీక్షించుచున్న!

== మంగళాంబ ==

[హావభావములు చూపి]

చంద్ర, ఈ ముఖచంద్ర వీక్షణమువలన
తేరుకోదని నీమతి, తిరిగి పోదు;

అయిన నొక్కటి యడిగెద అట్టులేని
శాంతితో నెట్లు వ్రాయుట సంభవించె?

[గ్రంథము తీసికొని చదువ బోవును]

= చంద్రమౌళి =

మంగళా, మంగళా, ఏమి మాటవినవు!
అబ్బ! చదువకు ముందలి యక్షరాలు!

= మంగళాంబ =

[నాలుగడుగు లావలకు వేసి]
ఎంతరమణీయ మూర్తు లీయక్షరాలు!
కానబడుచున్న దేమి నీకవితవోలె!

"చెంగల్వలం బోలు చిన్నపాదాల
ననుగు నెచ్చెలి మెట్టునట్టి మార్గంబు
పులకితంబయి వన్నె పూవులు పూయ
రత్నకంబళములు రంజిల్లు మిగుల.

"నా ప్రియసఖి పదన్యాస సౌభాగ్య
మొందిన యీ మందిరోపవనంబు
శ్రీప్రయాగ మహత్త్వ సిద్ధిచే సర్వ
దేవతలకుగూడ తీర్థరాజంబె.

"అనిమిష దుర్లభంబైన యాదివ్య
మంగళ విగ్రహ మంజుహస్తంబు
గ్రహియించు భాగ్యమ్ము కలుగు టెలాగొ!
ననగొను సంభ్రమ ధీవిస్మయాలు!"

మధురభావోజ్జ్వలంబులౌ మంజరులను
అల్లితివి చంద్ర! నీయది అమృతవాక్కు.
నాకు దెలియగ నీవ యెన్నాళ్ళనుండి
వ్రాయుచున్నావు కావ్యంబు వన్నెకాడ!

= చంద్రమౌళి =

ఇది యపూర్వము మంగళా, ఈప్రభాత
వేళ హృదయములోనుండి వెలికివచ్చె.

= మంగళాంబ =

కావ్యభాగమ్ము, శాస్త్రాలకమ్ము తెలియ
దెదద వెలువడి వచ్చినయది కవిత!

= చంద్రమౌళి =

కావ్యము రచించు బాధయే కలదుగాని
అంతరాయము ఘటియిల్లె నాదియందె
అవసితంబైన కృతి నీకరాబ్జమందు
ఉంచి సమ్మతి నర్థించియుండువాడ.

= మంగళాంబ =

సాగ నందురు రచన విశ్రాంతిలోన
బాధలో నీకు కవన మేపగిది కుదిరె?

= చంద్రమౌళి =

నీకు విదితంబు కాదె వాల్మీకి శోక
మొక్కయుదయాన శ్లోకత్వ మొందియుంట?

= మంగళాంబ =

అది పురాతన ఋషివార్త! అయిన చంద్ర,
ఏమిటికి నీకు గలిగిన దింతబాధ?

= చంద్రమౌళి =

చెప్పినంతనె తీరునా చిన్నదాన,
ఈ మనోవ్యథ వర్ణించి యేల నీదు
కోమలంబైన హృదయంబుగూడ నేడు
చింతతో నేను చికాకు సేయవలయు!

= మంగళాంబ =

ఆప్తులకు జెప్పుకొన్నచో వ్యథ తొలంగు
నెంతయో, దాచుకొన్నచో నేమి మేలు?
అవునులే కాను నీకు నేనాప్తురాల
నంతియేగాక కేవల మబలనుగద!

= చంద్రమౌళి =

ఆప్తులెవ్వరు నీకన్న నన్యులిచట
అప్పదీక్షిత పుత్రిక అబలయగునె?
కుసుమ కోమలమైన మానసము వేరు,
స్థైర్యవిరహితమైన చిత్తమ్ము వేరు.

= మంగళాంబ =

ఆప్తురాలను స్థిరచిత్తనైనయపుడు
నాకు నీవెత తెలుపుట న్యాయమొకద

వంచుకొని ఆంతో ఇంతో యత్నించిచూతు
నీ మనోవ్యథ తొలగింప నేర్తునేమొ!

= చంద్రమౌళి =

వార్తపంపినారు వైళంబ రమ్మని
తండ్రిగారు - పోవు తలపులేదు.
ఎట్లొ పోదు నేని యిచటికి రానీక
బంధుజనము నన్ను పట్టి నిలుపు!

= మంగళాంబ =

మంచి బంధుజనమె! మీ తండ్రికడ నీవు
ఇంక చదువ దగిన దేమి లేద!
అంతపనికిరాని దడయుప్పలగ్రామ!
మస్వతంత్రవృత్తి యనుచితంబు.

= చంద్రమౌళి =

అప్పదీక్షితార్యు లఖిల విద్యాగురుల్
అపరశివులు! వారి యంతికమున
అభ్యసింప విద్య లాయువు చాలునే?
ఎన్ని జన్మలైన ఎత్తవలయు!

అఖిలలోక పూజ్యు లాచార్యులే కాక
ఇంక నొకరుగూడ నిచట గలరు!
వీరి ననుదినమ్ము వీక్షింపలేకున్న
కనులగ్రమ్ము నాకు గాఢతమము.

అభిజనంబుచేరి నల్లైన మావారు
కన్నెనొక్కదాని గట్టిపెట్టి
కదలనీరు నన్ను గ్రామాంతరమునకు;
కలత కదిరె ప్రజల కారణంబు!

= మంగళాంబ =

[గొంతు సవరించుకొని, తెచ్చుకొన్న శాంతితో]

పెండ్లియన్న నింత భీతియేటికి చంద్ర
ఎపుడు చూడనైతి నిట్టివింత!
పరుగు పెట్టకుండ్రి పాణిపీడన మన్న
యువకులైనవార లుత్సుకతను!

= చంద్రమౌళి =

పెండ్లిమీద నాకు ప్రీతిలే దేమాత్ర
మిచట నుండ గోర్కె యెల్లకాల
మన్యచింత మాని యఖిల దర్శనములు
ఆగమములుగూడ నభ్యసింతు.

= మంగళాంబ =

[కొంచెము జంకుతో]

అంత నియతి బూని అవివాహితుండవై
కాల మెట్లు గడపగలవు? చంద్ర!
విసువు పుట్టు నెపుడొ విద్యలం దొకనాడు
సౌఖ్య రహితమగును జన్మ మింక!

= చంద్రమౌళి =

బంధు జనము నాకు పరిణయార్థము నిర్ణ
యించినట్టి కన్నె యింపుకాదు.

= మంగళాంబ =

[వికాసముతో]

సరసమైనవాక్కు! స్వయముగా వరియించు
నామెమీద ప్రీతియన్నమాట!
కావ్యభాగమందు కల్పితకన్యయో
వాస్తవికయొ అడుగవచ్చునొక్కొ?

= చంద్రమౌళి =

[ధైర్యము వహించి]

యువతి వాస్తవముగ నున్నదే మంగళా!
కావ్యకన్యకన్న కడుమనోజ్ఞ!

= మంగళాంబ =

[కొంచెము నీరసముగా]

నామధేయ మేమొ?

= చంద్రమౌళి =

నాలుగు వర్ణాలు.

= మంగళాంబ =

ఉచ్చరింప విందు నొక్కసారి!

= చంద్రమౌళి =

అమృత తుల్య మయ్యె, అది రేమొ జంకుచే
మాట రాదు నోట!... మంగళాంబ!

[మంగళ తల వంచుకొని గ్రంథము వేదికపై బడ
వేసి సమీప వృక్షముకడకు నడచును. చంద్రమౌళి
లేచి సంభ్రమముతో పోయి, ఆమె చేయి పట్టు
కొనును. మంగళ ఒకసారి అతనిని క్రీగంట జూచి
మరల అవనత వదన యగును]

= చంద్రమౌళి =

చాల కాలము నుండి స్వాంతమ్మునందు
గుప్తముగా నుంచుకొన్న భావమ్ము
తెల్లమైనది గదా చల్లనివేళ!

ఇప్పుడు నన్నీడి యెటకు బోయెదవు?
మంగళా, మంగళా, మాటాడవేమి?

అందాలనడక నీ వరుదెంచు నపుడు
పాదాలు ముద్దాడ ప్రభవించు కోర్కె
కట్టెట్టులో నిరోధించుచు నుందు.
నీప్రసన్నంబైన నిటలభాగమున
తీరిచి కుంకుమ తిలకమ్ము దిద్ది
చెక్కిళ్ళు ముద్దాడ మక్కువ గల్గు.
పదియారు వన్నెల పసిడియందాల
భవదీయ తనువల్లి బాహుయుగ్మమున
గ్రుచ్చి రొమ్మున హత్తుకొన బుద్ధి వొడము.
అవరించుచు నిన్ను ఆకాశమట్లు
కాచుచుండగ మహాకాంక్ష జనించు.

ఏది నన్నొకసారి యాశించు నిమ్మ
తృప్తి దీరంగ నీదివ్యదానవము!
ఇందాక లేని యీహ్రీభరం బేల?
నీకు నూతనుడనా నే ప్రియురాల

మంగళా, యేటికి మానకొన్నానో
యిన్నినాళ్ళు వివాహ మిత్రుడు విశ్వనాథు.
ధర్మపత్నిగ నిన్ను దలపోసి యెప్పుడు
గగనసౌధా లెన్నొ కట్టుచున్నాను!

[మంగళ విప్పారిన కనులతో ముఖము పైకెత్తగా,
ఆమెను సందిటచేర్చుకొని శిరస్సు మూర్కొని
చల్లని కంఠధ్వనితో]

= చంద్రమౌళి =

బాధ చెందుచునుండ బహుదినమ్ములకు
జీవితేశ్వరి, నన్ను స్వీకరించితివ!

= మంగళాంబ =

[అతని రొమ్ముపై శిరస్సు ఆనించి]
పాపము! మనసులో బాధచెందితివి
నాకోసమై యిన్నినాళ్లు ప్రాణేశ!

= చంద్రమౌళి =

ఎన్నాళ్ళకో గ్రహియింప గల్గితిని
నీమీద ననురక్తి నెలకొన్న యట్లు
అమీద బహుకాల మావహించినది
గురుపుత్రి వనియెడి గూఢభయమ్ము.
అవలనీవేమందు వనియెడిజంకు
విడువకన్నాళ్లు వేధింపబోచ్చె
అంతరంగికయుద్ధ మగుచున్న కొలది
తుద కట్టులో భీతి తొలగిపోయినది.

= మంగళాంబ =

అయ్యయో నిష్కారణమ్ముగ
అధిపా అయినారు నాథా
ఈతపస్విని యంతరంగం
బెరుకపడ కుంటన్!

ప్రథమవారము దృష్టిమీపై
బడినయపుడే చెప్పశక్యమా
కానిభావం బేదొ నాలో
కలిగె ప్రాణేశా!

కాలవాహిని సాగుచుండగ
క్రమక్రమముగ తెలియపోగను
స్వాంతమం దనురాగ రేఖలు
జటిల మయ్యెనని.

[illegible]

నాదు హృదయం బవగతం బగు
నాడు ముప్పిరి వేసికొన్నవి
విస్మయంబును భయము లజ్జయు
వివశమై పోవన్.

కాని యెట్లో తెప్పిరిల్లితి
గాఢరాగము మాత్ర మెదలో
దీపకళిక విధాన నిరతము
తేజరిల దోచ్చెన్.

పిదప జంకితి మీకు నాపై
ప్రేమ కలదో లేదొ తెలియక

= చంద్రమౌళి =

ఉభయులము వెత చెంది నామే
యూరకే భ్రమచే!

= మంగళాంబ =

అవల నూతన భీతి పుట్టిన
దవద నగు నను మీరు శ్రోత్రియ
పుత్రి లేవిధి జూతురో యని
బోధ పడ కుంటన్!

ఎరుగ నారైను మీ యమాయిక
హృదయ గమనము మెల్ల మెల్లన;
చనవు బూని మెలంగ సాగితి
సాహసము తోడన్.

= చంద్రమౌళి =

అదియ చెప్పవు! మంగళా, పరి
హాస మాడుచు నుండు కతమున
చాల తికమక పడితి తెలియక
చనవొ, ప్రేమడియో!

= మంగళాంబ =

చిన్న దానను గాన తెలియక
చేసినా నపచారములు! మీ
రన్ని దయతో మరచి నన్నిక
నాదరించెదరా!

= చంద్రమౌళి =

చాలు జాలును! నేను శ్రోత్రియ
జడిమచే నీసరసభావము
శీఘ్రముగ గ్రహియింపలేమికి
సిగ్గుపడవలయున్.

= మంగళాంబ =

చెప్పవచ్చున పిన్నతో నను
స్వీకరించి వివాహ మాడగ
నభిలషించుచు మీర లున్నా
రనెడి శుభవార్తన్?

= చంద్రమౌళి =

ఆమె కరుణార్ద్ర హృదయయే యగునుగాని
సమ్మతించునె విపరీత సంప్రదాయ
సిద్ధమైన వివాహమ్ము? చివర కెట్లు
పరిణమించునొ కోరిక ప్రాణకాంత?

= మంగళాంబ =

భయము చెందెద లేటికి ప్రాణనాథ!
ఇందు పెద్దలతాత్పర్య మేమొ నాకు
తెలియు నించుక అయినను త్రిప్పగలను
మనకు ననుకూలముగ వారి మానసములు.

= చంద్రమౌళి =

[మంగళను వేదికపై కూర్చుండబెట్టుకొని]

తలచుకొన్న కొలందిని ధైర్య మెడలి
పోవుచున్నది మంగళా! బుద్ధిమతివె
కాని నీ నేర్పు ఫలకారి కాగలుగునె
యిట్టి జతనమ్మునందు యోచించిచూడు!

"ఆసేతుబంధతట మా చ తుషారశైలా
దాచార్యదీక్షిత ఇతిప్రథి తాభిధానమ్
అద్వైతచిత్సుఖ మహాంబుధి మగ్నభావ
మస్మత్పితామహ మశేషగురుం ప్రపద్యే!

"యం బ్రహ్మ నిశ్చితధియః ప్రవద న్తి సాక్షా
త్తద్దర్శనా దఖిలదర్శన పారభాజః
తం సర్వవేద సమవేష బుధాధిరాజం
శ్రీరంగరాజమభిదం పితరం నతోఽస్మి!"

ఇట్లు మీతండ్రిగారు నుతించినారు
పూర్వులను; వారు విఖ్యాతపుణ్యమూర్తు
లప్పదీక్షితు లన్ననో అపరశివులు!
పూతమైన శ్రోత్రియ వంశజాత వీవు.

= మంగళాంబ =

నాకు మాతండ్రిగారు పునర్వివాహ
మొప్ప రను సందియము మీర లజ్జగింపు;
దార్ఢ్యహృదయులు వారు, మాయన్న లైన
కూర్మితో నాసుఖమ్మును కోరువారు.

చెల్లిపై ప్రేమ మరకతవల్లి, కింక
అమ్మయన్ననో మా కెదురాడ దెపుడు,
వలయుచో ప్రాణముల్ గూడ వదల గలదు
పిన్నతల్లి నాపైగల ప్రీతిచేత.

అస్మదనురాగ మామెకు నవిదితమ్ము
కాదు కేవల మనియెంతు, కార్యహాని
సంఘటిలనీక సకలమ్ము సంతరింతు
స్వస్థముగ నున్న మీరలు చాలు నాథ!

= చంద్రమౌళి =

అమృతవాక్కులు మంగళా! అయినగాని
యజ్ఞములు, ధర్మశాస్త్రమ్ము, లఖిలలోక
భూరి పూజ్యత, ద్రావిడబుద్ధి, మనకు
అంతరాయమ్ము కల్పించునని భయమ్ము.

= మంగళాంబ =

ఆంధ్రులము మేము, ద్రావిడు లనుటతగదు
స్మార్తులమె యైన కొంత వైష్ణవము కలిసె
తొల్లి రంగరాజాచార్య దుహిత తోత
కాంబ ప్రపితామహుని భార్య యగుటవలన.

= చంద్రమౌళి =

పట్టుదలలేదు మీ కుటుంబమ్మునందు
మంచిదే. నాకు మరణమో మంగళంబో—

= మంగళాంబ =

మంగళమె మంగళమె వేరుమాట వలదు
భారమంతయు నాయది ప్రాణనాథ!

[చంద్రమౌళి ఆమెశిరమ్ము మూర్కొనును. లతా
గుల్మములో కదలికగమనించి అతడు వెడలిపోవును.
మంగళ వేదికపై పరుండి కన్నులు మూసికొనును.
ఇంచుక సేపటికి మందగమనముతో ప్రవేశించి]

= సరసవాణి =

వెర్రితల్లీ! ఎంత వెదకినా నమ్మ
ఇల్లన్ని మూలల ఇప్పటిదాక
నీకోసమై! ఇట్లు నేత్రముల్ మూసి
వేదికపై సందెవేళ నెందులకు
పండుకొన్నావు నాబంగారుతల్లి!

ఏదీ యేదీ తల్లి ఇటువైపుచూడు!
బాధగా నున్నదా పలుకకున్నావు!

= మంగళాంబ =

మనసు మనసున లేదు! మాటాడ బుద్ధి
పుట్టకున్నది పిన్ని! పట్టుకో నన్ను!

= సరసవాణి =

ఎందుకే నాతల్లి! యిట్టులైనావు!
చెదరిపోయిన దేమి చికురజాలంబు?
కన్నులలో ఏల కాంతి మారినది?
చెన్ను దొరగినదేమి చెక్కిళ్ళ బిడ్డ?
ఇంతకు మున్నెన్న డిటు కానబడవు
నీయాననమునందు నిత్యమ్ము లేని
క్రొత్త నాకేదియో గోచరించినది!

= మంగళాంబ =

అవును పిన్నీ! ఇప్పు డద్భుతంబైన
బాధ యొక్కటి నన్ను పట్టి వేధించు.

= సరసవాణి =

కలికిపిల్లా యేమి వింతవాక్యాలు !
మల్లెపూవుల జడ మరకతవల్లి
చేయుటకై చాల వేడుకపడుచు
ఎదురుచూచుచు నున్న దికనైన తెమ్ము !

= మంగళాంబ =

అది బాధయో నూతనానంద మేమొ
పిన్ని, తెలియుటలేదు భేదమ్ము నాకు !

= సరసవాణి =

కాలు తగులునో యేమొ గ్రంథమ్ము చూడు
గమనించవైతివి ఘంటము క్రింద
బడిపోవుచున్నది. పాలుమాలికయా ?

= మంగళాంబ =

మరచినా దది చంద్రమౌళి యిచ్చోట.

= సరసవాణి =

[ఘంటము తీసి, గ్రంథము తెరచి చదివి]
ఈ మంజరీ గుచ్ఛ మెవరిని గూర్చి ?
ఎంతసొంపైనదో యచ్చోటువాని
చంద్రమౌళీశ్వరశర్మ చెప్పుదువ ?

= మంగళాంబ =

నీరాక కొకరెండు నిముసాలముందు.

= సరసవాణి =

ఈపద్యపాదమ్ము లేకాంతమందు
వినిపించెనా నీకు వేదికమీద ?

= మంగళాంబ =

క్రొత్తకావ్యంబన్న కుతుకమ్మువలన
బలవంతమున చేసి పఠియించినాను.

= సరసవాణి =

ఈమంజరీగుచ్ఛ మెవరినిగూర్చి
కూర్చినాడో నీకు గోచరించినదా ?

= మంగళాంబ =

ప్రథమాన సంశయాస్పదముగ నున్న
క్రమముగా క్రమముగా గ్రహియించినాను.

= సరసవాణి =

అవలనీ వేమంటి వాతనితోడ ?
నిద్దంపుచెక్కిళ్ళ చిరహాస్యమ్ము
చెప్పకయే నాకు చెప్పివేసినవి.
ముగ్ధ నాతడు నిన్ను ముద్దాడినాడు !
ఏ మందువు ?

= మంగళాంబ =

అపుడు నా కెరుకయేలేదు !
చీవాట్లు పెట్టవా చేసిన పనికి ?

= సరసవాణి =

చిట్టితల్లీ, ఏల చీవాట్లు నీకు ?
అతడు నీతో నేమి యన్నాడో చెప్పు !

= మంగళాంబ =

అనురక్తి లోలోన అణచుకొన్నాడు
బహుకాల మెంతయో భయమందినాడు
వివరింపక మనస్సు వెత చెందినాడు
నాచిత్త మెరుగక నవసియున్నాడు.

= సరసవాణి =

సరిసరి ! నీతోడి సల్లాపవేళ
చివర కే మన్నాడు చెప్పవు పిల్ల !

= మంగళాంబ =

పెద్దవారలమాట పెడచెవి బెట్టి
నాకోసమే మానినాడట పెండ్లి
గురుపుత్రికాభీతి కొంతకాలమ్ము
సంప్రదాయము కాదు అంచు కొన్నాళ్ళు
వేధింప శోధింప వివశుడై పోయి
తనమనోరథ మెట్లొ ధైర్యమ్ము బూని
ఈవేళనే నాకు నెరిగించినాడు.

పెద్దల సమ్మతి బెండ్లాడి నన్ను
ధర్మపత్నిగ జేయ దలచుకొన్నాడు
పాప! మెంతో అధిపాలయినాడు!

= సరసవాణి =

[ఆకసము వంక చూచి, తల పంకించి]

వింతసంఘటనమ్మ విధివిధానమ్ము!
ఉభయుల యనురాగ మెక్కంత తెలియు.

మాంగల్యసూత్రమ్ము మరల ధరించి
సుఖయించు భాగ్యమ్ము సుకృతవశాన
వ్రాసెనా నుదిటిపై వనజభవుండు!
ఆనందదాయి నీయభ్యుదయమ్ము!

= మంగళాంబ =

తప్పుచేసితి నంచు తలచుటలేదు
కరుణార్ద్రహృదయవు గావున పిన్ని!
[ఆమెయొడిలో తలపెట్టుకొనును]

= సరసవాణి =

వశము కాదే యెట్టి వారికిగూడ
మనసు! నీ కింతలో యమాయిక నైతి
విందులో నీదోష మే మున్నదమ్మ!
ఆచారబద్ధులైనట్టి పెద్దలకు
విపరీతముగ దోచు విధివిలాసంబు...
జననమ్ము చేతు నాశక్తి కొలంది

[మంగళ ఆమెను కౌగిలించుకొనును]

అనబోకు మేమియు అమ్మలోనైన
భాగ్యవశమ్మున పరమదయాళు
వధిగత సకల ధర్మార్థగురుండు
నీతండ్రి అనుకూల నిర్ణయమ్మునకు
వచ్చుటయున నింక వర్తింప వలయు.

= మంగళాంబ –
అవగతంబే నాకు నాదినుండియును
పిన్నికి నామీద ప్రేమ మిక్కుటము!
తెలియదు ఋణ మెట్లు తీర్చుకోగలనో!

= మరకతవల్లి =

[అటునిటుచూచుచు సమీపమునకువచ్చి]
ఎంతసేపటినుండి నీకై
యెదురుచూచుచునుంటి గానీ
తోటలో ఈమూల చివరకు
దొరకినా వమ్మా?
అసురసంధ్యావేళ పిన్నీ,
అలసించెదరేల యిచటనె!
ఇంకనైనను లేచిరాక
మింటిలోపలికి?

ఎపుడు కలలలాడు వదనం
బిట్లు వన్నె దొరంగ నేలా
చెల్లెలికి ఈవేళ స్వస్థత
చెదరలేదుగదా?

= సరసవాణి =

[మరకతవల్లి చేయిపట్టుకొని చల్లగా]
చెల్లెలివిషయమై చెప్పగాదగిన
సందర్భ మున్నది శాంతచిత్తమున
వృత్తాంత మంతయు విని నీవు కూడ
దుర్ఘటకార్యాన తోడ్పడవలయు.

= మరకతవల్లి =

[ఉత్సాహముతో]
దుర్ఘటం బని సంశయింపకు
తోడుపాటుకు సిద్ధురాలను!
చెల్లెలికి ఏ మైన గానీ
చేసితీరవలెన్!

[వారిచెంత కూరుచుండును.]

====== ప్రథమరంగము ======

# కుమారసంభవ విమర్శము

బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు రచించిన గ్రంథ మిది. ఇందులో ముఖ్యంగా కుమార సంభవ కర్తయైన నన్నిచోడదేవుని కాలం నిర్ణయింపబడ్డది. ఇంకా ఏ వేవో ఇతరవిషయా లున్నా ఇందులో ముఖ్యంగా నిర్ణయించదలచినది నన్నిచోడుని కాలమే. ఈ విషయములో వీరు చెప్పిన హేతువులన్నీకూడా పరిదుర్బలాలు. ఏ మైనా అంతాకలిపి ఒక్క ప్రకరణానికి మించని సామగ్రి ఇది. దీన్ని ఏ వేవో సంగతులతో పెంచి ఆరు ప్రకరణాలగ్రంథం చేశారు. పోనీండి ఎంతగ్రంథమైనా వ్రాసినంతవరకైనా సరిగా ఉందేమో అంటే ఏ ఒక్క విషయములోనూకూడా ఇది సరియైన త్రోవలో ఉన్నది అనుకోడానికి వీలులేదు ఇంతెందుకు? అసలు దీనిపేరే స్వరూపాన్ని బయలు పెడుతుంది. గమనించండి: నన్నిచోడునికాలం నిర్ణయించే ఈ గ్రంథాన్ని "నన్నిచోడదేవకాల నిర్ణయం" అనడమా? "కుమారసంభవవిమర్శము" అనడమా? ఉపక్రమోపసంహారాలు కానీండి-అభ్యాసాదులు కానీండి-ఇంతెందుకు-వారి స్వంతవాక్యాలు కానీండి ఇందులో ముఖ్యంగా నిరూపణీయం "నన్నిచోడుని కాలనిర్ణయమే" అనే విషయం స్పష్టపరుస్తూ ఉన్నవికదా! ౧, ౨, ౩, ౪, ౫ ఆశ్వాసాలలో పూర్తిగానూ ౬ వ ఆశ్వాసములో స్వల్పంగానూ కాలనిర్ణయప్రయత్నమే కనబడుతుంది.

ఉపక్రమంలో వారి వాక్యాలు చూడండి. (౩ వ పుట) "దీనిపైని వెలువడిన కొన్ని విమర్శనములు చదువుట తటస్థించినది. అవి కవికాలనిర్ణయ ప్రయత్నము ముఖ్యముగా చేసికొని రచించినవి. వాని జదువగా నింకను సవిమర్శముగా గావ్యభాగము పరిశీలించుట యావశ్యకమని తోచినది." వారు చిట్ట చివరి పుటలలో "సింహావలోకనము" అనే పేరుతో వ్రాసిన ఆరు హేత్వాభాసాలూ కూడా (చూ. ప్రతిభ సం ౨. సం ౨. పుట ౧౯౩) అందుకే అని స్పష్టం. అంతేకాక కుమారసంభవం లోని రసభావపాకశయ్యారీత్యలంకారగుణౌచిత్యాదులను గురించిన విమర్శం లేశం కూడా లేదు. ఒక చోట సరిగానే ఉన్నదానిని అనుచితం అన్నారు. * అట్టి స్థితిలో ఈపుస్తకాన్ని "కుమారసంభవ విమర్శము" అనడం నేతిబీరకాయ అనడమే కాదా!

పోనీండి కాలనిర్ణయం ఐనా సరిగా నడిచిందాఅంటే అదీలేదు. సహజంగా సరళంగా సమన్వయించే ప్రమాణాలను అట్లా సమన్వయించలేదు. కొన్నిచోట్ల కేవలం అనావశ్యకమైన వ్రాత వ్రాశారు. మరికొన్నిచోట్ల అవి హేతువులుకావు సరిగదా, హేత్వాభాసాలుకూడా. కాని వాటిని పెద్ద ఆర్భాటంతో నిరూపించారు. మొదటనే నన్నిచోడుని కాలాన్నిగురించి ఒకమాటనుకొని ఉన్నవాటిని

* ౧౬౬ వ పుట, "గీ॥ నన్ను నొరయ వేడియే నాథ యిచట, బోడవునూపక దాగి ఈ పొదలలోన, నిన్నుబాసి చరింతునే నిమిషమైన, గామరహితంబుగా రతిగలదె యెందు. క॥ రతిహితుడవనగ నెప్పుడు రతిసంగతి నుండుదీవు రతినిప్పుడు దుఃఖితజేసిపోయి తక్కట రతివంచన సేసిపోక రసికుల గుణమే." ఈ రెండున్ను అనుచితాలన్నారు. ఇందువల్ల ఇవి వీరు సరిగా అర్థంచేసుకోలే దనవలసి వచ్చింది. సరిగా అర్థంచేసుకొన్నవా ళ్లెవళ్లూ ఇక్కడ అనౌచిత్యం ఉన్నదనరు. చక్కగాపరిశీలించాలి.

దానికనుగుణంగా సమన్వయింపబోయినారు. తమకు ప్రబల ప్రతిబంధకాలుగా ఉన్న ప్రమాణాలను దుర్బలములైన యుక్తులతో నిరసించడానికి పూనుకొన్నారు. క్రమంగా నిరూపిస్తాము.

ఒరయూరు చరిత్రము ఇందులో పూర్తిగా అనావశ్యకమే. ఒరయూరివిషయ మెక్కడో తమిళ గ్రంథాలలో ఉన్నంతమాత్రాన ప్రకృతపు కొలచర్చలో దానికి ప్రసక్తికల్పించడం ఎంతమాత్రమూ ఉపయోగపడదు.

ఉద్భటచరిత్రంకూడా అంతే. ఉద్భటుడు కుమారసంభవం అంతా రచించాడా కొంతరచించాడా అనే వివాదంగానీ, అలంకార లక్ష్యాలవరకే రచించాడన్న వీరి అపసిద్ధాంతంగానీ ప్రకృతానికేమీ ఉపయోగించకపోగా పైపెచ్చు చాల పొరపాటుకూడాను. ఏమంటే ప్రాచీనులందరుకూడా ఉద్భట మహాకవి కుమారసంభవమనే మహాకావ్యాన్నే రచించాడన్నారు కాని అలంకారలక్ష్యాలవరకే రచించాడని అనలేదు. వీరు వ్రాసినప్రకారమే అతని శ్లోకాలవరుస చూచినా అంతమాత్రమే రచించాడనడం పూర్తిగా పొరపాటని స్పష్టపడి తీరుతుంది. ఏమంటే ప్రారంభంలో "తదాప్రభృతి నిస్సంగో" అని ఏదోకథతో మొదలుపెట్టినవాడు ముగింపులోకూడ ఏదో జరిగెను అనిగదా ముగించాలి ? అట్లాకాకుండా "జడలుము బహుభాషలేల?" అని ఈ తీరున ముగిస్తాడా ? ఇట్లాగే ముగించేవానికి "అప్పటినుండియు నా మహాదేవుడు...దినములు గడుపుచుండెను," అనేఉపక్రమంసరిపోతుందా ? ఇంతేకాక వీరి భాషాంతరీకరణం ప్రకారం చూచినా గ్రంథం అలంకార లక్ష్యాలకోసమే రచింపబడలేదనీ స్వతంత్రంగానే ఇదివరలో రచింపబడి ప్రకృతం లక్ష్యాలు తీసుకోబడినవి అనిన్ని స్పష్టపడి తీరుతుంది. ఏమంటే ఈ శ్లోకాలు అలంకారాల క్రమాన్ని అనుసరించిలేవు.

శ్లోకాలక్రమం పరికిస్తే ౨౯ వ శ్లోకం తరువాత ౨౨ వ శ్లోకం ఉండాలి. ౨౩ వ దాని తర్వాత ౩౦ ఉండాలి. ఇంకా ఇట్లాగే పరిశీలిస్తే వ్యత్యాసం బోధపడుతుంది, లక్ష్యాలకోసమే వ్రాస్తే ఇట్లా వ్యత్యాసం రావలసినపనేమి ?. అసలు ఉపమాదీపకములనే విషయమే ఈ విషయాన్ని స్పష్టపరుస్తుంది, ఈ సందర్భంలో వ్యాఖ్యాతలు చెప్పినదాన్ని శాస్త్రిగారు నిరసించి "దీపకంచోపమా చైవ" అన రాదా ? అన్నారు. సంస్కృతకవితామర్యాద ఎరిగినవా రెవ్వరూ ఇట్లా అనరు. "చ" ఇత్యాదులు సముచ్చయములన్నవి కదా అని "చహైతు కించహైతుహి" అనే శ్లోకం వ్రాసి మహాకవి అనిపించుకొన్నవా రెవ్వరూ కనబడలేదు. పై పాఠములో దేనితో దేనికి సముచ్చయము? ప్రారంభంలోనే అట్లా సముచ్చయము ఉంటుందా? "ఉపమాదీపకంచైవ"అనే పాఠంలో ఉపమతో సముచ్చయం యుక్తంగా ఉంటుంది. అదీకాక మొట్టమొదట్లోనే అసందర్భంగా చకారకుక్షిగా శ్లోకం ప్రారంభించడం యుక్తంగా ఉంటుందా? కనుక వ్యాఖ్యాతలు అతనికి సన్నిహితులు చెప్పిన హేతువును సరిగా ఉన్నదాన్ని తిరస్కరించి ఏదో తోవ తొక్కబోవడం చాలా అయుక్తం. ఈ౯౦శ్లోకాలు వ్రాసినంతమాత్రాన్నే ఉద్భటుణ్ణి మహాకవిగా పరిగణిస్తారా ఇతరులు అనేనాకొంచెము ఆలోచించవద్దా? అదేమీలేకుండానే ఈకొద్ది శ్లోకాలు మాత్రమే అతడువ్రాశాడనడం అపసిద్ధాంతం. ఉద్భటుడికి సన్నిహితుడైన ప్రతీహారేందురాజు (వ్యాఖ్యాత) స్పష్టంగా కుమారసంభం ఉద్భటుడు వ్రాసెనని చెప్పిఉండగా అదికాదని నిన్నమొన్నటివాళ్లం ఉద్భటుడికేమాత్రమూ సంబంధించని వాళ్లం మనము అనబోవడం ఎంతసాహసమో కొంచెం ఆలోచించినారా శాస్త్రిగారు?

అంతేకాక "క్రమమున నుద్భటుడు గవిత్వము మెరయ గుమారసంభవమ్ము నలంకారము గూఢవస్తుమయకావ్యముగా హరులీల జెప్పి హరుమెప్పించెన్"అని నన్నిచోడుడు చెప్పినదానినికూడా చాలా

తప్పుగా అన్వయించారు. "క్రమమున" అనే పదమే కుమారసంభవము, అలంకారము, హారలీల అనే మూడు గ్రంథాలు అని స్పష్టపరస్తుంటే ఏవేవో లేనిపోనివలు తోక్కడం ఎందుకు? ఇక్కడ 'అలంకారము' అంటే అలంకారలక్షణ గ్రంథముకదా? అది కుమారసంభవం అవుతుందా? శాస్త్రిగారి యిష్టప్రకారం అయినా అది లక్ష్యగ్రంథంగాని లక్షణగ్రంథంకాదుగదా. ఇట్లా రెండుగ్రంథాలు ఇష్టంలేకపోయినా ఒప్పుకోక తప్పనప్పుడు హారలీల విషయమై వీరికి పట్టెందుకు? వేయిపద్యాలతో హారలీలాస్తవం ఉద్భటుడు వ్రాశాడని సమయపరీక్షలో బ్రహ్మశివకవి స్పష్టంగానే చెప్పాడుకదా! ఇక వీరి ఉద్భటుడి గ్రంథత్రయం విషయంలో సంశయంగానీ వీరి అపసిద్ధాంతంగానీ ఎంతటి సరసమైనవో విచారించండి. స్పష్టంగాచెప్పియున్న ఈవిషయంలో ఏదో సూచన ననుసరించి సంశయపడడం ప్రజ్ఞావంతుల లక్షణమా? వస్తుమయకావ్యం అంటే సంస్కృతకావ్యం అనిఅర్థం చెప్పరాదు. "గూఢవస్తుమయకావ్యము" అనేదానిని కుమారసంభవానికి విశేషణం చేశారువారు. అదితప్పు నన్నిచోడుడే "నింగిముట్టియున్న జంగమమల్లయ వరమునందు గనినవస్తుకవిత దగిలి వానియందనెగడింతు" అనిచెప్పి తెనుగు కుమారసంభవమే అతని కంకితంగా రచించాడు. ఇప్పుడు శాస్త్రిగారెంత తప్పుదోవలో పడ్డారో గ్రహించండి. హారలీలాస్తవంలోనే హారుని చరిత్రం గూఢంగా ఉండేటట్లుగా కూర్చాడని అర్థంకనక హారులీలతో నన్వయింతురేని అక్కడ గూఢత్వ మెక్కడనుండును? అని శాస్త్రిగారనడం అవిచారితమని స్పష్టం. పైపెచ్చువారికే బాధకంకూడాను. వారి యిష్టప్రకారం కుమారసంభవంతో అన్వయిస్తేమాత్రం ఈ ఆశంక వారికి తీరిందా? గూఢత్వం ఇందులో అసలే లేదుగనుక వారి కిది గడుకే. ఇట్లాగే ఉద్భట చరిత్రంలోకూడా సరిగా కుదిరేవాటి నన్నింటినీ వీ రెందువల్లనో సమన్వయించుకోకపోయినారు. కాశ్మీరదేశవాసి అయిన ఈ ఉద్భటుడే సమయ పరీక్షలో చెప్పినట్లుగా హారలీలాస్తవాన్నిరచించి బొందతో కైలాసానికి పోయినాడు.ఇట్లాసరిపోతూఉండగా అనావశ్యకాలయిన సంశయాలెందుకో వారికి? కాశ్మీరదేశవాసిఅయిన ఉద్భటుడు వీరశైవుడు కానోపడట! ఎందువల్లనో? కాశ్మీరంలో వీరశైవంలేకనా? ఇతడు శివద్వేషికనుకనా? నిజానికి శైవం, శాక్తం, వీరశైవం మొదలైనవి కాశ్మీరంలోనే సమృద్ధంగాఉండేవి. జాగ్రత్తగా పరిశీలించండి.

ఇంకొకవిచిత్రం-ఈవిధంగా చూచినాకూడా అనుకరణాలు కానిచోట అనుకరణాలంటారు శాస్త్రిగారు. పరిశీలించండి శాస్త్రిగా రనుకరణాలన్నవి :

| కాళిదాసు:— | నన్నిచోడుడు పుట-౫౦:— |
| --- | --- |
| ౧ నాగేంద్రహస్తాత్వచికర్కశత్వా<br>దేకాంతశైత్యాత్కదళీవిశేషాః<br>లబ్ధ్వాపిలోకేపరిణాహిరూపం<br>జాతాస్తదూర్వోరుపమానబాహ్యాః | ౧ స్మరమందిరమ్ముశోభా<br>కరముగ మెరుగారు పసిడికంబములనగా<br>గరమొప్పు నగతనూజకు<br>గరభోరులు వొలుచు మదనకరికరలీలన్. |
| ౨ వృత్తానుపూర్వేచనచాతిదీర్ఘే<br>జంఘేశుభేసృష్టవతస్తదీయే | ౨ అతనుండోపని శివు వశ<br>గతుజేసిభవాని మదనుకవదొనలతిలోశో<br>న్నతిసాచి కొనియొనోయను<br>గతిజిరుదొడలమరు వీహిగర్భాభములై. |

ఇక ఉద్భటుని అనుకరణా లన్నవి చూడండి:—పుటలు 115,116,

౧. అంగలేఖాం కాశ్మీర
సమాలంబనపింజరామ్
అనలక్తకతామ్రాభా
మోష్ఠముద్రాంచబిభ్రతీమ్

౨ త్వత్కృతేసోపిశైకుంతః
శశివోషవిచంద్రికామ్ మొ॥

౧ మేనికుంకుమరాగంబు మెలతతొప్ప
మోవితాంబూలరాగంబు మొగినవాని
చారుతరమయ్యెజాడ నా శైలతనయ
వీతరాగంబు ప్రకటించు విధమువోలె.

౨ వారిరుపోనవ నీరూపుగనుగొన్న
నలకూబరుండైన గలచివచ్చు మొ॥

పోనిండి, ఇవి అనుకరణాలని వారి తృప్తికోసం మనం ఒప్పుకొన్నా దీనివల్ల నన్నిచోడుని కాలనిర్ణయంలో లేశమాత్రంకూడా ఉపయోగం లేదని స్పష్టం. ఇక తిక్కన అనుకరణాలన్నవి చూదాము.

౧ కూలురూపు దన్నికొనియెడిరూపును
నొఱలురూపు నేల నొఱగురూపు
బొరలురూపు నయ్యెనరవాజిగజములు
ప్రధనభూమి ఘోరభంగిగాగ-తిక్కన

౧ మురిసెడిరూపులున్ మురిసి మొగ్గడిరూపులు
మ్రొగ్గిజిఱ్ఱునం దిరిగెడిరూపులుం దిరిగి
త్రెళ్ళెడిరూపులు త్రెళ్ళి నేలపై బొరలెడి
రూపులుం బొరలిపోయెడిరూపులు బోయి
క్రమ్మరఁ మరలెడిరూపులున్ మరలిమ్రగ్గడి
రూపులునయ్యె నయ్యనిన్.

౨ వానినెల్లద్రుంచి వలద్రచ్చుకొని లీల
నిగుడుచోటవోలె నెగడువడక
ఈటిమి రక్తనదులవఱమెమస్తకకూర్మ
హస్తభుజగతతులనతిశయిల్ల

౨ కరములుద్రెవ్వినఒండుల
గరాసికఱచికొని రాద్రగతి ననిమిషో
త్కరము దెగబఱచెనొక్కడు
సురవాహినిదఱియు కొమ్ముజోఱయుబోలెన్.

౩ కనుగన్నై వినుజెవియై
కొనుజవిజిహ్వయయి మూరుకొనునా
సికయై
తనువైస్పర్శముగైకొను
యనవద్యాబుద్ధి యాత్మయండనిలుచుచున్

౩ వినిచెవుల ముట్టితోలం
గని కన్నుల నమలి నాలుకను మూర్కొని ము
క్కున బురుషుడెగుగు మనమా
రను శబ్దస్పర్శరూపరసగంధంబుల్.

౪ స్వాతిగతుండగు శుక్రుం
డే తెరగబరగ జేయునెసక వర్షం
బా తెరగున సాయకవ
ర్షాతిశయంబావహించెనతడు నరేంద్రా

౪ అతతముగ శుక్రుడు తన్
స్వాతిగతుండయిన గురియు సంతతధారా
పాతమునుబోలె దనుజ
వ్రాతముపైగుహుడు బాణవర్షముగురిసెన్.

ఈచోట్లనట శాస్త్రిగారికి అనుకరణము కనబడుతున్నదట. ఇందులో ౧,౩, అనుకరణములు కావని ఒకరుచెప్పనె అక్కరలేదుకదా! ౨ వ దాని విషయంలో శాస్త్రిగారేదో కొంతవ్రాశారు. అసలీ ఉపమానం మూలంలోనే (సంస్కృతభారతం కర్ణపర్వం) ఉన్నదని వారే ఒప్పుకొన్నారు. అట్టి స్థితిలో తిక్కనపద్యంలో "చోటు" నన్నిచోడుని పద్యంలో "కొమ్మ చోటు" అవుతుందా? సంస్కృతాన్ని చూచికాని లేక స్వీయానుభవం చేతకాని నన్నిచోడుడు ఈమాత్రం గొప్ప విషయం

వ్రాయలేదా? * ఇక వాల్లభదానిలోని విషయం లోకప్రసిద్ధం. అదీకాక యీవిషయం "యథా స్వాతి గతశ్శుక్రః" అని భారత సావిత్రిలో నేవుంది. దీనిని నన్నిచోడుని వద్దనుండి తిక్కన తీసుకున్నాడేమో! ఏమంటే నన్నిచోడుని వర్ణనావైచిత్ర్యం పెద్దలైన వాటిని తిక్కన్న చాలాచోట్ల అనుసరింపబోయి నట్లు కనబడుతుంది. కేతన అనుసరింపబోయి చేతకాకపోయినట్లున్నాడు. గ్రంథవిస్తరభీతిచేత దీన్ని ప్రకృతం వదలి వేస్తున్నాము. ఎట్లాఉంటే అనుకర్తో ఎట్లాఉంటే అనుకార్యుడో అన్న భేదం బాగా గమనింపగలిగిన వారుగాని అనుకర్తలనూ అనుకార్యులనూ గ్రహింపజాలరు. చూడండి "బాహుబలోన్నతి పాటించి రాక్షసాధీశుపట్టిన చెరలెల్లవిడచి షణ్ముఖు భుజశిలా స్తంభాగ్రమున జయశ్రీ బొందె సాలభంజికవిధమున" అని నన్నిచోడుడు; "శ్రీరాస్తాం మమ ముక్తికీశ్వర భుజస్తంభే జగన్మండల ప్రాసాదస్థిర భారభాజి దధతీ సా సాలభంజీశ్రియం" అని తిక్కన. తిక్కన్న నన్నిచోడుడు అనుకరించాడంటారు శాస్త్రిగారు. "జగన్మండల ప్రాసాదస్థిర భారభాజి" అని సవిశేషంగా నన్నిచోడుని అభిప్రాయమును తిక్కన్న చమత్కరించడం ప్రముఖవేద్యంగా ఉన్నాకూడా మొదటి పద్యంలోనే నన్నిచోడుణ్ణి అతడనుకరిస్తాడా? అంటారు శాస్త్రిగారు. మొదటిపద్యం అయితే అనుసరించకూడదా? మొదటిపద్యంలో అనుకరణలులేవా ఎక్కడా? శ్రీనాథుడు పద్యాన్ని పెద్దన్న మనుచరిత్ర ప్రారంభపద్యంలో అనుకరించాడోలేదో విజ్ఞుల నడగవచ్చును. బాగా పరిశీలిస్తే నన్నిచోడుని కవితామార్గంగానీ, భావకల్పనగానీ, వర్ణనాప్రాగల్భ్యంగానీ, కారకసంధానంగానీ తిక్కనగారికి అందుబాటులో ఉన్నట్లు కనబడదు. నన్నయ్యకుకూడా పూర్తిగా అందుబాటులో ఉన్నట్లు కనబడదు. ఇక కేతనాదుల విషయంలో శాస్త్రిగారిచ్చిన పద్యమే •పరికిస్తే కేతన నన్నిచోడుని పద్యాన్ని సరిగా అనుసరించలేకపోయినాడని స్పష్టపడుతుంది. వీటన్నింటికీ మూలసూత్రం నన్నిచోడుని కాలనిర్ణయం. దాన్ని పరిశీలిద్దాం. ఈ ప్రకరణంలో శాస్త్రిగారికి నన్నిచోడుడు తిక్కన్నకు చాలా తర్వాతివాడని నిరూపించాలని గట్టి పట్టుదల కనబడుతున్నది. అందువల్లనే సరిగా సమన్వయించేవి కూడా వారికట్లు సమన్వయించలేదు. వాటిని నిరాకరించారు.

౧౨ వ పుటలో ఇచ్చిన చ॥ అరివరపాలమౌళి (కుమా. ౧,౫౩), క॥ కలుపొన్న విరుల......వెంకణాదిత్యుండర్కు, (కుమా. ౧,౫౪) అనే పద్యాలలో మొదటిది-ఇరువదియొక్క-వేయి గ్రామములుగల పాకనాటికి అధిపత్యము అతని తండ్రికి కలదని స్పష్టపరుస్తున్నది. రెండవపద్యంలో ఒరయూరిప్రభుత్వము వెంకణాదిత్యబిరుదము తనకున్నవని స్పష్టము. ఈ దిగువ రెండూ కులక్రమాగతము అంటారు శాస్త్రిగారు. ఇది అవిచారితము. తెలుగుపద్యాలకర్థం చెప్పేవారెవరయినా అట్లా అర్థంచెప్తారా?

---

*తిక్కన్న కవిత్వంలో అస్త్రశస్త్రాలబాధుపబడ్డ భటుడు వానిని చొచ్చుకొనివచ్చుటలో వలవ్రచ్చుకొని వచ్చు చోరుఉపమానం, నన్నిచోడుని కవిత్వంలో నోరకత్తిబట్టి సురవాహినిపై బడిచెడు యోధునకు కొమ్ముచోటు ఉపమానం. ఈరెంటికీ పోలిక ఎక్కడున్నదో మాకు తెలియలేదు.

•చూ. ౧౩౩ పుట. ఈకేతనపద్యము మూలములో గంభీరముగా క్లుప్తంగా ఉన్న విషయానికి తగిన అనువాదముకాదు. కేతన పెంచివ్రాయడములో ఔచిత్యమూ అర్థసౌందర్యమూ చెడిపోయినవి. నన్నిచోడుని పద్యంమీద ఉన్న ఉబలాటంచేత ఔచిత్యానౌచిత్యాలెరుగక ఆపద్యంలోని కొంత అర్థం సంగ్రహించి పద్యంపూర్తిచేశాడు. కొండవీటి చేంతాడంతటి ఈపద్యం ఇంకొకవిధంగా ఏర్పడి ఉండదు.

తండ్రికి పాకనాటి ప్రభుత్వాన్ని ఇతనికి ఒరయూరు ప్రభుత్వాన్ని టెంకణాదిత్యబిరుదాన్ని ఈపద్యాలు చెప్పడంలేదా? దిగువనున్న రెండుబిరుదాలూ తండ్రికున్నట్లు ఆ పద్యాలలో లేదుకనుకనే ఈతనికే అవి మొదటిసారి ఏర్పడ్డవని స్పష్టం. అతడవి స్వభుజబలంవల్ల సంపాదించాడు కనుకనే ఒరయూరు పురవరాధీశుడ టెంకణాదిత్యుండన్, అని తనను స్పష్టపరిచినాడు. అంతేకాక "కావనిమడియడె టెంకణాదిత్యుండున్" అను ప్రాచీన పద్యంలో ఇతడే టెంకణాదిత్యుడని అసాధారణంగా పేర్కొనబడడంవల్లకూడా అవి స్వార్జితములని స్పష్టపడుచున్నది. ఇందుకు చెరుకూరి శాసనంకూడా పూర్తిగా అనుకూలపడుతుంది*

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నిరూపించిన మల్లికార్జునగురువు విషయంలో సంశయాని కవకాశమేలేదు. ఏమంటే చోడబల్లిసుతుడైన నన్నిచోడుని కాలంలో మల్లికార్జునుడు గురుపదంలో ప్రతిష్ఠితుడు. శాసనాధారంతో దొరుకుతుంటే కుమారసంభవంలో నన్నిచోడుని గురువైన మల్లికార్జునుడితడే అనేవిషయంలో ఇంకొకప్రమాణం కావాలి అనే శాస్త్రిగారు పడేసందేహానికి అవకాశం ఉన్నదా? "న్యగ్రహీదుగ్రవీరారీన్" అనేదీ "న్యగ్రహీదరి చతుర్విధసైన్యాన్యగ్రహీత్" అనేదీ ఏక కర్తృకాలే అనడాని కేమీ అభ్యంతరంలేదు. బాధకప్రమాణాలులేక సాధకప్రమాణాలుండేటప్పుడు ఏకకర్తృకత్వం ప్రమాణితం కాకపోదు. చెరుకూరు కొప్పరపుశాసనాలు రెండింటిలోనూ మల్లిదేవుడే శాసనాలు చెక్కించినట్లు కనబడడం, రెండూ ఒక్కదేశంలోనే సమీపభాగలలో దొరకడం శాసన శ్లోకాలలో కవితాసామ్యం భావసామ్యం ఇవిసాధకాలు. మల్లిదేవులనేకమంది ఉండవచ్చునని సంశయపడేవారికి ఏమిచెప్పి సంశయం పోగొట్టగలం?

ఇకను, ప్రాచీనతాసాధకాలుగా పూర్వులు నిరూపించిన ప్రమాణాలలో ఏఒకటికూడా శాస్త్రిగారి వల్ల నిరుపద్రవాలైన యుక్తులచేత ఖండింపబడలేదు. ప్రాచీన శాసనగత సీసాలలో ప్రాస యతి నియమాలున్నవనీ, నన్నిచోడు డాకాలపువాడే అయితే ఆ నియమాన్ని పాటించడా అనీ అంటారు శాస్త్రిగారు. వారిచ్చిన సీసంలోనే ఒకచోట "దీర్ఘాసి భగవతి దేవిదేవాలయ"అని ప్రాసనియమపు సీసంలో నియమభంగమున్న, యతినియమపు గీతిలో "మెచ్చులోడ దమకునిచ్చుచుండ" అనేచోట యతి నియమభంగమున్నలేదా? నిజాని కీవిషయమే నన్నిచోడుని ప్రాచీనుడని చాటుతున్నది. ఏమంటే శాసన పద్యాలననుసరించి కేవలప్రాసో కేవలయతో అనే నియమం ఆనాటికి దృఢంగాలేదనీ అక్కడక్కడా అలంకారంగా వాడబడుతూ ఉన్నదనీ తెలుస్తున్నదిగదా! మన కవిరాజుకూడా ఈనియమాన్ని కొన్నిచోట్ల కావ్యసౌందర్యంకోసం పాటించాడనీ అది నియతంకాదు కాబట్టి కొన్ని చోట్ల పాటించలేదనీ స్పష్టం.

అక్కరలవిషయంలోకూడా వారిమాట వారికే తగులుతుంది. తిక్కన్నతరువాత ఎఱ్ఱన్న అక్కరలు వాడడంలో నన్నయ్య అనుసరణం అన్నారు. తిక్కన్న కేల లేకపోయిందో? తిక్కన్న స్వతంత్రుడంటారేమో "అ మూడుపర్వములలో సామాన్యుడు (నన్నయ) నుడువు తెనుగు లరసికొని కృతుల్ తాము రచించిరి తిక్క సుధీమణి మొదలైన తొంటి తెనుగుకవీంద్రుల్" అని పెద్దలు చెప్పినారు. పోనీలెండి దానికేమి నన్నయ్యకంటె ప్రాచీనుడైతే అక్కరలు వాడేతీరవలెనా? అని వ్రాస్తే ప్రాచీనుడూ కాకపోతే అర్వాచీనుడూనా?

---

*అనుకూలపడేమార్గం వీరరాజుపంతులుగారే నిరూపించి ఉన్నారు శాస్త్రిగారి ఆక్షేపణలు సమంజసంగా లేవు.

పదలకు యతిమైత్రివిషయంలో శాస్త్రిగారు భారతారణ్య పర్వంలో "పర్వతముగ్రహించి నట్లు దన బాహుల దాని గ్రహించి" అనే అపూర్వపాఠాన్ని కాదనడం తాళపత్రాల్లో "బలవంతం" అనేపాఠం ఉన్నదనడం ఏమీసరిగాలేదు. భారతాదులను బాగా పరిశీలించిన అపూర్వపాఠం అప పాఠం అవడమూ తమఅవసరంకోసం "బలవంతు" డనేపాఠం ఏదో ఇటీవలి తాళపత్రప్రతిలో ఉన్నదని సాధించడమూనా.

ఇక బంధకవిత్వ విషయం. ఇది ఆంధ్రంలో ప్రవేశించినకాలం చాలా తరువాతిదిఅని వారివాదం. ఇది అపరిశీలితం. కవిరాజు సాంస్కృతిక సంప్రదాయాన్ని పుణికిపుచ్చుకున్నట్టు అతడిగ్రంథమే చెప్తుంది. నన్నయకు ప్రాచీనకాలంలోనే భారవి మాఘుడు మొదలయినవారి కావ్యాలలో బంధకవిత్వం ఉంది. దాన్నిచూచి ఇది రచించి ఉండవచ్చు. అంతేకాక ౧౩ వ శతాబ్దంనాటినుండి ఉన్న చక్రబంధాలలో కవినామమో కృతిపతినామమో సామాన్యంగా ఉండితీరుతుంది. ఇతని చక్ర బంధంలో అటువంటి నియమం లేదుకనుక ఇత డానియమానికి ప్రాచీనుడు కావలెను.

దీర్ఘాలమీది నిండుసున్నల విషయంలో శ్రీరామకృష్ణకవిగారు చెప్పినదంతా అస్తవ్యస్తంగా గ్రహింప బడింది. వారియభిప్రాయమిది. "దీర్ఘాచ్ఛే త్ఖండఏవ సజ్జేయః" అన్ననన్నయగారిసూత్రం వచ్చింది మొదలుకొని దీర్ఘాలమీద నిండుసున్నల ప్రయోగాలు చాలా అరుదైనవి. అసలు లేనేలేవనవచ్చును. ఒకటీ అరా ఎక్కడైనా తప్పిదారివున్నా అవి ప్రబంధాలలో అచ్చతెలుగుపద్యాలవలె చమత్కా రంకోసం వ్రాసినవై ఉంటవి. నన్నయ్యగారికిపూర్వం అవి తరుచుగా ఉన్నవనేసంగతి ప్రసిద్ధం. కనుక వాటిని తరుచుగా నిశ్శంకగా ప్రయోగించిన నన్నిచోడుడు ఆనియమానికి ముందువాడేకాని తర్వాతివాడుకాడు అని దీనిమీద శాస్త్రిగారు౧౨౧, ౧౨౨ పుటలలో వ్రాసినవ్రాతకేమైనా అవకాశమున్నదేమో ఆలోచించండి.

ఇంకొకవిషయం. "ఎడ్డ" మొదలయిన స్థలములలో తేల్చిపలుకవలసి ఉండుటకూడ నన్నిచోడుని గ్రంథంలో తరుచుగా కనబడడంవల్ల అట్టిప్రసక్తులులేని నన్నయతిక్కనాదుల గ్రంథాలకన్న ఇదిప్రాచీన మని శ్రీరామకృష్ణకవిగారొక అసాధారణకారణాన్ని నిరూపించారు. పాపం ఈవిషయంలో శ్రీశాస్త్రిగారికి అధరస్పందంకూడా చేయడానికి అవకాశంలేక మెల్లిగా దీన్ని జారవిడిచారు. ఇట్టి విశేషం నన్నయతిక్కనాదులం దెక్కడైనా చూపగలరా శాస్త్రిగారు?

ఉపమానోపమేయభిన్నలింగవచనాదులు ఈతని గ్రంథమున గొలదికిమించి చూపట్టుట యొకప్రాచీన సాధనము" అని శ్రీరామకృష్ణకవిగారివాదము. ఇందుకు శ్రీశాస్త్రిగారు తిక్కనభారతంలో "విజయ రోహణాద్రి" "కవ్వడియను కారుమొగులు" అనేరెండుప్రయోగాలిచ్చి "తిక్కనలోగూడ ఉపమానోప మేయభిన్నలింగవచనాదులున్న" వనిరి. ఇందువల్ల వీరికి ఉపమానోపమేయాలేవో సరిగా తెలియవా అనిపిస్తున్నది. లేకపోతే పైస్థలాలురెండూ రూపకస్థలాలుకాని ఉపమాస్థలాలా? ఇది సరిగా గుర్తించక తిక్కనలో కూడా అవి ఉన్నవంటే ఏమనుకోవాలి! ఆ భిన్నలింగవచనరూపం అయిన వ్యత్యాసం ఉపమాస్థలంలో విశేషంకాని రూపకస్థలంలో దానికి ప్రసంగమేలేదు. పోనీ అదట్లా ఉన్నా "విజయరోహణాద్రి" ఇక్కడ భిన్నలింగవచనాలేవి? ఇదంతా అలంకారశాస్త్రం సరిగా తెలియకపోవడంవల్ల వచ్చిన అగ్రహంతోడి పొరపాటు. కాబట్టి ఈప్రకరణంలో శ్రీరామకృష్ణకవి గారిని గురించి "అవి (ఉపమానోపమేయభిన్నలింగవచనాదులు) కొలదికి మీరియునటలో కొంత తప్పించుకొనుటకై త్రోవ వెదకికొనిరి" అనిఉల్లంఘనగా మాట్లాడారు, అవేవో తెలియనివారి ఉల్లంఘన కర్థమేముంది?

ఇట్లా శాస్త్రిగారు చూపిన కారణాలవల్లనే కవిరాజు ప్రాచీనత్వం సాధితమైంది.

పైన వివరించిన తీరుగా శాస్త్రిగారి గ్రంథంలో అనేక వాదాలు అసమంజస పోకడ పొందక ఉన్నవి. మచ్చుకు కాళిదాసు కుమారసంభవం అష్టమసర్గాంతమా సప్తదశ సర్గాంతమా అనే విషయం ఒకటి. అరుణగిరినాధుడు కుమారసంభవ మెంతవరకు అని చర్చించి అష్టమసర్గాంతమే కాని సప్తదశసర్గాంతము కాదు అని తేల్చుటవల్ల అతని నాటికి (౧౩ వ శతాబ్దం) సప్తదశసర్గాంతమైన గ్రంథం బహుప్రచారంలో ఉన్నదని తెలుస్తూఉన్నది. కాబట్టి "ద్వాదశశతాబ్దప్రాంతంలో ఎవనిచేతనో కాళిదాసు నామమున రచింపబడినదని యూహింపబడిన సంస్కృత కుమారసంభవోత్తరసర్గభాగములలోని భావములు కొన్ని నన్నిచోడుడు గ్రహించుట" అన్న శాస్త్రిగారివాదం ఎంతఅసందర్భమైనదీ స్పష్టమే. ఇందులో రెండు అసంగతా లున్నవి. ఒకటి-౧౨వ శతాబ్దప్రాంతములో ఎవడో రచించినాడని ఎవరుచెప్పినారు వీరికి? ఎవ్వరూకూడా ఈవిషయంచెప్పలేదు. రెండోది ఉత్తరసర్గలలోని భావాలను నన్నిచోడుడు గ్రహించినాడనడం ౭౪, ౭౭ పుటలలో అనుకరణాలని కొన్నిచ్చారు శాస్త్రిగారు. వాటిలో ఏఒక్కటీకూడా అనుకరణం కాదని చూచినవెంటనే స్పష్టపడుతుంది. ఇక 'గరుడేభాజ' అనే పద్యం మామూలుగా దిక్పాలకులకు లోకప్రసిద్ధాలైన వాహనాలేకాని అందుకోసం కుమారసంభవశ్లోకం చూడవలసిన అవసరంలేదు. ఇంతేకాక ఇది అనుకరణంకాదనడాని కొక గొప్ప గుర్తుకూడా ఉన్న దిక్కడ. సంస్కృతంలో అష్టదిక్పాలకులుమాత్రమే కుమారునివెంట పోయినట్లున్నదిగాని విష్ణువుకూడా పోయినట్లులేదు. తెలుగులో విష్ణువుకూడా వెళ్లినట్లుంది. అంతేకాదు; సంస్కృతంలో నైరృతునకు ప్రేతవాహనము; కుబేరునకు నరవాహనము. తెనుగులో నైరృతునకు నరవాహనము, కుబేరునకు తురగవాహనము. ఇట్లు ప్రబలమైన వ్యత్యాసములున్నవి. వారన్నట్లు సంస్కృతాన్నే అనుసరిస్తే నన్నిచోడుడిలో వ్యత్యాసంగా ఎందుకుంటుంది?

ఈ అన్నివాదాలకన్నకూడా విచిత్రమైన వాదం ఒకటిఉంది. దాన్నిఉట్టంకించి ఈ గ్రంథంముగిస్తాము. "ఒకవేళ లక్షణశ్లోకముల కూర్పు లక్ష్యరచనానంతరమే చేసెనని యొప్పుకొనినను, లక్షణక్రమము లక్ష్యరచనకు పూర్వమే నిర్ణీతము కావించుకొనినాడనక తప్పదు." అని వ్రాశారు. ఇదేమి వాదం?ఈయుక్తి యేమిటో మాకు బోధపడలేదు, లక్ష్యక్రమానికి ముందు లక్షణక్రమం నిర్ణయించుకోవలెనని నియమం ఉన్నదా? ఉద్భటుడు కుమారసంభవం మొదటవ్రాశాడు. తరవాత అలంకారం వ్రాశాడు. దీనికి లక్ష్యాలుగా తనకుమారసంభవంలోనివే శ్లోకా లుదాహరించాడు. అవే సరిపోయినవి కనుక ఇంతమాత్రమేజరిగింది. ఇది స్పష్టంగానే ఉంది. వ్యాఖ్యాతలుకూడా ఈవిషయమే తేల్చినారు. ఉద్భటుడికి కాలతః సంప్రదాయతః కూడా సన్నిహితుడైన ప్రతీహారేందురాజు(వ్యాఖ్యాత) చెప్పినది అబద్ధమున్నూ అత్యంత విప్రకృష్టులూ అతనికెటూసంబంధములేనివారూ విన శాస్త్రిగారు చెప్పిన యుక్త్యాభాసం సత్యమూనా? ఇట్లా ఎవరైనా వ్రాస్తారా?

ఇంతవరకు నిరూపించిన గ్రంథంవల్ల శాస్త్రిగారిగ్రంథం ఎంతసరిగా ఉన్నదీ, ముఖ్యనిరూపణీయమైన నన్నిచోడుని కాలవిషయంలోకూడా ఎంతతప్పుతోవతొక్కినదీ పాఠకులకు విశదమే. గతసంచికలో ప్రకటించిన (ప్రతిభ ౨ వ సంపుటము ౨వ సంచిక, పుట ౧౮౪) వ్యాసలేశములో ఇందులోని విషయము సమన్వయముచేసుకొంటే ఈగ్రంథప్రాశస్త్యమూ ఎట్టిదో బోధపడుతుంది.

జె.వి.

# అచటనే యుండు

**దేశిరాజు కృష్ణశర్మ**

పాకుతూ సోలుతూ
పై బడగ దొర్లుతూ
పరితాప పడుతు నే
మరలి వచ్చేదాక
అచటనే యుండు నీ
వచటనే యుండు.

కన్నులే కాయలై
గిర్రిగిర్రిన తిరుగ
మన సెల్ల అవశమై
మరచి వచ్చేవేళ
మరచి పోబోక నీ
వచటనే యుండు.

చక్రాల తిరుగుళ్ళ
చరచు పరపుల దాగి
శల్యమై ప్రాణాలు
చిక్కబట్టుక నేను
సరవి వచ్చేదాక
సాగి పోబోక నీ
వచటనే యుండు.

చిన చిన్న దీపాలు
శక్తిరూపాలు
పెద పెద్ద దీపాలు
పెద్ద పాముల్లు
దీపాల వెలుగులో
దేదీవ్యమానవై
తేజరిల్లుచు నన్ను
మరచిపోబోక నే
మరలి వచ్చేదాక
అచటనే యుండు.

క్రూరములు క్షుంభితములు
ఘోరరూపాలలో
కోసి చూచినగాని
గుండెలే లేవయ్యా!
చేతనంబును బొంది
జీవములు లేనట్టి
ఈ శవంబుల మధ్య
నే చచ్చుచును బ్రతికి
సరవి వచ్చేదాక
సాగి పోబోక నీ
వచటనే యుండు.

ఉదయభానుని చూసి
బుద్ధి మంతుడ నౌచు

---

[కొండమీద దేవాలయం. సగంలో భక్తుడు జర్రిన కాలు జారిపడ్డాడు. మళ్ళీ ఎక్కడానికి విశ్వప్రయత్నిస్తున్నాడు. జీవిత లక్ష్యమే దేవాలయం; భక్తుడు జీవయాత్రికుడు.]

సాంధ్య చంద్రుని చూచి
చెట్టు బుద్ధుల నెరిగి
ప్రొద్దు పొడుపుల జీవ
పుంజమ్ము మేల్కొలిపి
సాంధ్య కాంతులలోన
సమయించును బ్రతికి నే
సరవి వచ్చేదాక
సాగి పోబోక నీ
వచటనే యుండు.

మృదువుగా తరళముగ
వెలిపూల చాలులో
రేకగా క్రొన్నిటి
తరగలో నురుగుపై
కొసరుగా సులువుగా
పై కెగయు విహాగ మటు
ఒదిగి ఒదుగుల్లోన
నలిగి నలిగీ నేను
తలక్రిందుగా తిరిగి
అటు తిరిగి ఇటు తిరిగి
పాకుతూ సోలుతూ
పై బడగ దొర్లుతూ
పరితాప పడుతు నే
సరవి వచ్చేదాక
సాగి పోబోక నీ
వచటనే యుండు.

ఇటు చూచి అటు చూచి
వెనక ముందుల చూచి
తలకిందుగా చూచి
మనసులో చూపుంచి
ఎలుగెత్తి ఏడ్చుచూ
చేయెత్తి పిలుచుచూ
పుణ్య పాపాలన్ని
మంచి చెడ్డల నెల్ల
నా యేడ్పులో కలిపి
నా చూపులో చూపి
నిను చూచుచూ నేను
పాకుతూ సోలుతూ
పై బడగ దొర్లుతూ
పరితాప పడుతు నే
మరలి వచ్చేదాక
మరచి పోబోక నీ
వచటనే యుండు నీ
వచటనే యుండు !

# బారిష్టరు పార్వతీశం

## [ విమర్శన ]

### బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం

మొక్కపాటి నరసింహశాస్త్రిగారు 'బారిష్టరు పార్వతీశం' (మొదటిభాగం) వ్రాసి పదేళ్లు పైగా అయింది. 1937 ఫిబ్రవరిలో భవానీ భాండారం వారు ఈ మొదటి భాగానికి రెండోకూర్పు తయారుచేశారు ఈగ్రంథం అతిచక్కగా ముద్రింపబడి కంటికి చాలా ఇంపుగాఉంది. భవానీ భాండారం వారు ప్రచురించిన ఈ పుస్తకం పార్వతీశం కథ చదివి ఆనందించిన ప్రతి ఆంధ్రుడూ కొనవలసిన దవును.

తెలుగువాళ్ళలో 'బారిష్టరు పార్వతీశం' పేరు విననివాళ్లెవరూ ఉండరు. పార్వతీశం కథ చదువుతూ, ప్రతిసందర్భంలోనూ కాకపోయినా, కొన్నిసందర్భాలలోనైనా తనివితీరా నవ్వనివాళ్లుండరు. ముఖ్యంగా చిన్నతనంలో చదివిసట్టయితే ఈ ఆనందమూ నవ్వూ చాలా ఎక్కువగా ఉంటాయి. రమారమీ పదేళ్ల తర్వాత మళ్ళీ మొన్న పార్వతీశంకథ తీసి చదవబోతే చిన్నప్పుడు ఈ కథే చదువుతూ ఎంత ఆనందించానో జ్ఞాపకం వచ్చింది కాని పూర్తిగా చిన్నప్పటి ఆనందమూ ఉత్సాహమూ నాకు కలుగలేదు. కాని, నరసింహశాస్త్రిగారు అది నాతప్పేసని పార్వతీశం తప్పు కాదని వాదిస్తేకూడ ఆయనమాట నమ్మడానికి సిద్ధంగాఉన్నాను.

పార్వతీశం అనే వ్యక్తి నొకడిని సృష్టించడంలో నరసింహశాస్త్రిగారు నిజమైన గొప్పతనం చూపించారు. నిజంగా తెలుగు వాఙ్మయానికి చాలా మేలుకలుగజేశారు. పార్వతీశంవంటి తెలివితక్కువ మనుష్యులు మనపూర్వపుకథలలో లేరనికాదు. ఉదాహరణంగా పరమానందయ్యగారి శిష్యులగురించి అనేక కథలు మనం అందరం ఎరుగున్నవే. కాని అటువంటి కథలన్నిటిలోనూ ఆ తెలివితక్కువకు శిష్యులయొక్క చర్యలే ముఖ్యంకాని ఆ శిష్యులు ముఖ్యం కారు. ఆ కథలు చదువుతుంటే, ఆశిష్యులెటువంటివాళ్ళో, వాళ్ళ మనోభావాలెటువంటివో, ప్రతిశిష్యుడియొక్క సంపూర్ణ జీవితమూ ఎటువంటిదో మనకి తెలియనూ తెలియదు, తెలుసుకుందామన్న కుతూహలమూ మనకి కలగదు. ఎందువల్లనంటే, ఆ కథలలో హాస్యానికి ప్రధానమైన

పదార్థం అంతా వాళ్ళ చర్యలలోనే ఉందికాని వాళ్ళలో లేదు. పార్వతీశం చర్యలకంటె పార్వతీశం మనకిఎక్కువ ముఖ్యం. పార్వతీశాన్ని గురించి అన్ని పరిస్థితులలోనూ అన్ని విషయాలూ తెలుసుకుందామన్న ఆసక్తి మనకి ఉండడమే పరమానందయ్యగారి శిష్యుల కథలకీ పార్వతీశంకథకీ నిజమైన భేదం. పార్వతీశం రైలుబండిఎక్కి రైలు గొలుసుకి తన సామాన్లన్నిటిని చేంతాడుతో కట్టేడన్నంత మాత్రాన మన నవ్వు పూర్తికాదు. గార్డు రావడం గార్డుతో పార్వతీశం జరిమానా ఇచ్చుకోలేనని ప్రాధేయపడడంకూడా కథ పూర్తిచేసినట్టుకాదు. "ఆఖరికి ఎలాగైతేనేమి నా సామాను గొలుసుని విప్పివేయమని వాళ్ళు చక్కాపోయినారు. వాళ్ళు వెళ్లినతరువాత నా అపరాధ మేమిటని పక్కనఉన్న వాళ్ళ నడిగి తెలుసుకున్నాను; అక్కడ గొలుసు కాస్త లాగితే రైలు ఎలాఆగుతుందో అనుకున్నాను." పార్వతీశం రైలుగొలుసుయొక్క ప్రభావం గురించి ఈ ఆఖరివాక్యంలో దీర్ఘాలోచనలో పడ్డట్టు మనకి కనబడేవరకూ మనకి సంతృప్తిలేదు. ఈ చర్యే పరమానందయ్యగారి శిష్యుల చర్య అయినట్టయితే రైలుగొలుసుకి సామాను కట్టగానే కథ మనకి పూర్తయినట్టే.

ఒకవిధంగా ఆలోచించినట్టయితే పార్వతీశం కథలో పార్వతీశం చర్యలలోకంటె పార్వతీశం ఆలోచనలలోనే ఎక్కువ హాస్యరసం ఉందని ఒప్పుకోక తప్పదు.

> 'బేసిన్ బ్రిడ్జి అనే స్టేషను వచ్చింది. నేను స్టేషనులోదిగే జనాన్ని చూస్తూ నిలబడ్డాను. ఒకాయన నల్లదొర నా దగ్గిరికి వచ్చి టిక్కట్టు ఇమ్మన్నాడు. ఇచ్చాను. చూచి మాట్లాడకుండా జేబులో వేసుకున్నాడు. ఇదేమిటిరా, టిక్కట్టు తీసుకుపోతున్నాడు. ఏమన్నా గట్టిగా అడగడానికైనా—నల్లగాఉన్నా—దొర. నా గతి ఏమికాను ?'

> చెన్నపట్నంలో ట్రాముకార్లనుగురించి: 'వీధిలోకి రాగానే నడిరోడ్డుమీద ఇంజన్ లేకుండా రైళ్ళు పరుగెడుతున్నవి.'

> 'చిన్నప్పటినుంచి ఎంతో జాగ్రత్తగా పోషించిన బారెడు జుట్టూ వాడు గబగబా రెండు కత్తిరింపుల్లో కత్తిరించివేశాడు. అద్దములో నా ముఖము నాకే కొత్తగాఉంది. కడిపెడు దుఃఖమూ దిగమింగి చేష్టలుడగి అద్దములో చూచుకుంటూవుంటే "షాంపూచేసేదా సార్" అన్నాడు. అదేమిటో తెలియలేదు, కాని ఇంతవరకూవచ్చినతరువాత ఇంకా ఏమిచేస్తే ఏమని గుండె రాయిచేసుకొని మొండిబ్రతుకు గనక "కానీ"మ్మన్నాను.'

(ఎగ్మూరులో) 'రైలు బయలుదేరింది. చాలా దూరమువరకూ చిన్న చిన్న స్టేషన్లు దగ్గిర దగ్గిరలో చాలా ఉన్నాయి. అక్కడెక్కడా రైలు ఆగలేదు. రైలాగనప్పుడు మధ్య నిన్ని స్టేషన్లు ఎందుకుకట్టారా అనుకొన్నాను. పెట్టెలో కూర్చున్నాయన నడుగుదా మనుకొని ఇదివరకే పల్లెటూరు దద్దమ్మన్నాడు. ఈప్రశ్న వేస్తే యింకా ఏమంటాడో అనుకొని ఊరుకున్నాను. కాని చెన్నపట్నము పొలిమే రెక్కడో చెప్పండని కోరాను.'

(స్టీమరులో భోజనానికి) 'తెచ్చిన పదార్థము దాని ఆకారమువల్లా వాసనవల్లా బ్రాహ్మణులు ముట్టుకో తగ్గదికా దనుకున్నాను. మనదేశంలో మాంసముతినేవాళ్లయినా కూరల్లే వండుకుని అన్నములో వేసుకుని తింటారనుకున్నాను. వీళ్లు అన్నములేకుండా వట్టి మాంసమే తింటున్నారు! ఆ గిన్నె తీసుకొని నాదగ్గిరికి వచ్చాడు. నాకక్కరలేదన్నాను...... ఇంక మనకర్మము విశ్వాస్తలాగ అర్ధరాత్రివేళ రొట్టెలు కాల్చుకోవలసిందే కాబోలు అనుకున్నాను.'

'స్టీమరువాళ్లే పరుపులూ అవీ వేసి ఉంచడము మూలాన్ని నామంచమూ బొంతా తీయవలసిన అవసరము లేకపోయింది. ఆ పరుపుమీాదన పడుకుని చీకట్లో ఈ మహాసముద్రములో స్టీమరుకి దారి ఎలా తెలుస్తుందో అని ఆలోచిస్తూ నిద్రపోయాను.'

(స్టీమరులో) 'ఒకరోజు మరీ వికారంగా ఉండి రాత్రి యేమీా నిద్రపట్టలేదు. తల బద్దలేస్తోంది. ఇంటి సంగతి జ్ఞాపకం వచ్చింది. కాస్త శొంఠి కొమ్మయినా లేకపోయింది గదా అనుకున్నాను. ఉంటే మట్టుకు మనకు గంధంతీసి యిచ్చేవా రెవరు ?'

(ఇంగ్లండులో) 'ఆ దొర మర్యాద చూస్తేమట్టుకు నాకు మహాఆశ్చర్యంగా ఉంది. మన దేశమువస్తే వాళ్లు ఎంతటివాళ్ళనో లక్ష్యపెట్టరు. ఇక్కడవాళ్ళంతా నన్నొక చిన్న జమీాందారుని చూసినట్టు చూస్తున్నారు. దొరలచేత పనిచేయించుకుంటూ వాళ్ళదగ్గరనుంచి సలాము లందుకుంటోంటే మహా సంతోషంగా ఉంది.'

బారిష్టరు పార్వతీశం'యొక్క ప్రత్యేకత ముఖ్యంగా ఇటువంటి వాక్యాలలో ఉందికాని, పార్వతీశం రైలుబండిలో పొరపాటున ఆడవాళ్ళమీద పడడంలోనూ, సెంట్రల్ స్టేషనులో రామస్వామి మొదలియారు సత్రానికి రెండురూపాయిలకి బండి కట్టించుకోడంలోనూ, స్టీమరులో వాంతిచేసుకోడంలోనూ అంతగాలేదు. ఇటువంటి విషయాలుకూడానరసింహశాస్త్రిగారు చాలాచమత్కారంగా వర్ణించారన్నమాటనిజమే. పార్వతీశం రైలుగోలుసులాగడమూ, చెన్నపట్నంలో ట్రాముకారువెంట పరుగెత్తడమూ, ఆడటోపీ కొనడమూ, స్టీమరులో స్పూనుఫోర్కులతో తిండి తినడానికి ప్రయత్నంచెయ్యడమూ చాలా సహజంగానూ చాలా అందంగ నూ వర్ణింపబడ్డాయి. కాని కొన్ని భాగాలలో హాస్యం హద్దుమీరి రసం చెడడంకూడాఉంది.

ఈకింది ఉదాహరణ చూద్దాం :

> చెన్నపట్నంవెళ్ళే రైలులో : ఆవిడ (బ్రాహ్మణవితంతువు) లేవడానికి పునః ప్రయత్నము చేస్తూఉంటే, పాపము మళ్ళీ పడుతుందేమోనని నాచెయ్యి ఆవిడవీపుకు బోటుపెట్టి ముందుకు కొంచెముతోశాను. లేచి నా సహాయమువల్ల లేచానుగదా అని సంతోషించడానికిబదులు కోపంగా 'అదేమిటిఅబ్బాయి కొంచెముదూరంగాకూర్చోకూడదా ఊరికే మీదికి రాకపోతే? నీకు తోడబుట్టినవాళ్ళులేరా? ఇల్లు బయలుదేరిరావడమే చాలున్లే ఒక్కటేనూ! నాబ్రతుకుఅంతా ఇలాగానే వెళ్ళుతున్నది. దారిలో ఎరిగున్నవాళ్లెవరైనా కనబడకపోతారా అని నేటికి తెగించి తిరుపతి వెడదామని బయలుదేరినందుకు ఈ అవస్థలన్నీ పడవలసివచ్చింది!'

ఇంతవరకు ప్రశస్తంగాఉంది. కాని ఆవితంతువుచేత ఇంకా

> 'ఆ మహారాజుఉంటే ఇంత అవస్థలేకపోయేదికదా! చచ్చి స్వర్గాన్న ఉన్నారు. ఎప్పుడు రాత్రిళ్ళు రైలులో ప్రయాణముచేసినా, ఒసేవ్ నీకు మేలుకుంటే జబ్బుచేస్తుంది, ఎలాగో కాస్త సందుచేసుకుని నడ్డి వాల్చమనేవారు.'

అని అనిపించడం ఈసందర్భంలో పొరపాటు. ఆవితంతువు మొగుడినీ మొగుడి సలహానీ జ్ఞాపకంతెచ్చుకోడం హాస్యకరమైనవిషయమే. కాని ఏవితంతువైనా ఈపరిస్థితులలో తన 'మహారాజు'ను గురించి ఇలా పైకిమాట్లాడడం కేవలం అసంభవం. అటువంటప్పుడు ఆ వితంతువుచేత ఆఖరివాక్యాలు అనిపించకుండా ఉంటే బాగుండును.

ఇదేవిధంగా :

> రైలు తిన్నగా కొలంబోదాకా వెళ్ళదా అన్నాను. నా ముఖముకేసి చూసి అదివరదాకా నాతోటి మాట్లాడుతున్న గౌరవ స్వరముమార్చి "అబ్బే వెళ్ళదండి ఈమధ్య, పూర్వము రాములవారి వారధి బాగుండే టప్పుడు వెళ్ళేదిట; కాని దరిమిలా అది సికస్తుపడి సముద్రము మామూలుగా అడ్డుగాఉండడమువల్ల ఇప్పుడు వెళ్ళడము మానేసింది. ఇది బాగు చేయడానికి మళ్ళీ ఆంజనేయులుగారికి కబురుచేద్దామనుకుంటే, వారి ఆడ్రెసు సరిగా తెలియలేదు."

అనడంలోకూడా నిష్కారణంగా, నవ్వు ఎక్కువగా కలిగించడానికి ప్రయత్నిస్తూ, నష్టపోడం కనిపిస్తుంది. ఆంజనేయులుగారి అడ్రెసు అన్నప్పుడు గ్రంథకర్త మనం నవ్వుతామనుకున్నంతనవ్వు మనకి రావడంలేదని మనకి తెలుసును.

కొలంబోలో కుక్ అండ్ సన్ వారి కంపెనీలోకి పార్వతీశం ప్రవేశించబోయినప్పుడు పార్వతీశానికీ బంట్రోతుకీ జరిగిన ఘర్షణకూడా నరసింహశాస్త్రిగారు అర్థం లేకుండా పెంచేశారు.

'బారిష్టరు పార్వతీశం'లో మరొక చిన్న లోటుకూడా ఉందని చెప్పాలి. పార్వతీశం ఎటువంటివాడంటే, మనకి తెలిసిన దిది :

> 'నేను టెయిలర్ హైస్కూలులో అయిదోఫారముదాకా చదువుకొన్నాను. ఒకటి రెండేళ్ళు ఆక్లాసులోనే కారణాంతరాలచేత గడపవలసి వచ్చింది...మా స్నేహితుడొకడువచ్చి మాటలమధ్య ఇంగ్లండువెళ్ళి చదువుకోమని హితోపదేశముచేశాడు...అన్నివిధములచేతను దేశాటనము శ్రేయస్కరమనీ, పైగా మన అధికారుల దేశమువెళ్ళి వాళ్ళ ఆచార వ్యవహారాదులుచూసి గుట్టూమట్టూ తెలుసుకొంటే స్వారాజ్యసంపాదనకు వీలుగాఉంటుందని ఆలోచించి, అక్కడికి వెళ్ళి బారిష్టరు పరీక్షకు చదువుదామని నిశ్చయము చేసుకొన్నాను'.

మనకి తేటపడేవిషయం ఏమిటంటే ఈ మనిషికి లోకజ్ఞానం కించిత్తు కూడా లేదనీన్నీ ఇటువంటిమనిషి సీమప్రయాణానికి బయలుదేరినట్టయితే అనేక పరిస్థితులలో తెలివి తక్కువగానూ వినోదకరంగానూ ప్రవర్తిస్తాడనీన్నీ, ప్రయాణంలో అతనికి కలిగే ఉద్దేశ్యాలూ ఆశలూ బెంగలూ అన్నీ చాలా నవ్వుతాలుగా ఉంటాయనీన్నీ, కాని

కొన్నికొన్ని సమయాల్లో ఈ లోకజ్ఞానంలేని పార్వతీశం నిజమైన గడుసువాడిలా ఆలోచిస్తున్నట్లూ నిజంగా తెలివితేట లున్నవాడిలా ప్రవర్తిస్తున్నట్టూ నరసింహ శాస్త్రిగారు కథ వ్రాశారు. ఈ సందర్భంలో ఈ కింది ఉదాహరణలు చూడవలసిన వవును.

(పార్వతీశం ఆరు యజ్ఞోపవీతాల జతలూ మూడు పట్టుమొలతాళ్లూ తీసుకువెళ్ళటానికి నిశ్చయించుకున్న తర్వాత) "ఇంకా ఎంతసేపు ఆలో చించినా తీసుకొని వెళ్ళవలసినవేవీ కనబడలేదు. ఇదంతాచూచి కొంద రికి చాదస్తముగా కనబడవచ్చుకాని వెళ్లేది దూరదేశము. ఏచిన్నవస్తువు మరచిపోయినా అక్కడ ఇబ్బంది పడవలసివస్తుందని మొదటినుంచీఎక్కువ జాగ్రతకలవాడినికనుక చాలా దూరాలోచనచేసి ఇవన్ని తీసుకొనివెళ్లాను."

తన దూరాలోచన గురించి తన తెలివితేటల గురించి పార్వతీశం ఇంత ఆలోచించ కుండా ఉన్నట్టు వ్రాస్తే పార్వతీశం చరిత్ర వినోదకరంగా ఉంటుంది.

(చెన్నపట్నంలో ఆడటోపీకొన్నాడు. తన బసలో నల్లబ్రాహ్మడితో వాదిస్తూ) 'అయితే ఏమంటావన్నాను.' నీకెందుకయ్యా ఈ ఆడవాళ్ళ టోపీలన్నాడు. "ఓయి వెర్రినాయనా కొలంబోలో నేఎరిగున్నవాళ్ళు న్నారు. వాళ్ళకి బహుమతి చేయడానికి తీసుకువెడుతున్నా" నని చెప్పాను. కాని నామాట అతనుమట్టుకు నమ్మినట్టు కనబడలేదు.

పార్వతీశం ఇంత పట్టుదలగా ఇంత తెలివైన సమాధానం చెప్పేడంటే నమ్మడం కష్టం.

'నేను అనవసరంగా దెబ్బలాడే స్వభావము కలవాణ్ణికాను. అందులో లాభించేదేమీలేదని తెలుసుకున్న తరువాత అసలే పేచీలోదిగను. ఒక వేళ పొరపాటున దిగినా తక్షణము గౌరవముగా ఇంగ్లీషువాళ్ళు యుద్ధ ములో తమ పని మరోలా గవుతుందన్నప్పుడు మర్యాదగా యుక్తిగా వెనక్కు తగ్గినట్లు నేనూ అటువంటి సందిగ్ధసమయాల్లో వెనకంజ వేస్తాను.'

నీటి తుంపరలు మీదపడుతూ నేల అంత కంతకు దూరమైపోతూ ఒడ్డు నున్న దీపాలు దూరమైనకొద్దీ మిణుకు మిణుకుమంటూ అన్నివైపులా చీకట్లుక్రమ్ముకువస్తూ పైన నీలాకాశము దానికి వ్రేలాడగట్టిన పాదరసపు బుడ్లలాగా అనేకకోట్ల నక్షత్రాలూ కింద ఎటుచూచినా అగాధమైన

> సముద్రమూ, ఆకెరటములమీాద లేస్తూదిగుతూ ఉయ్యాల ఊగుతున్నట్లు అంతా మాబాగుంది. నాకే కవిత్వమువస్తేనా అనుకున్నాను. ఇంతకూ ఆంధ్రుల అదృష్టము బాగుంది, నాకు కవిత్వము రాకపోవడము. ఇప్పు డున్న కవులకి తోడు నాపాటివాడు ఇంకొకడు బయలుదేరితె భరించలేక పోయేవాళ్లు ఆంధ్రులు.'

ఆంధ్రకవులను గురించి ఇంగ్లీషు యుద్ధపద్ధతులను గురించి పార్వతీశం ఇంతమట్టుకు ఆలోచించగలడంటే నమ్మడానికి లేదు. పార్వతీశానికి (ఎంత చిన్న సందర్భంలో నైనప్పటికి) ఈ పాటి తెలివైన ఆలోచనలు తట్టడం దుర్లభం కాదంటే ఒకవిధంగా అది కథకి నష్టమే అనికూడా చెప్పాలి. కథలో ఒక పార్వతీశం బదులు ఇద్దరు పార్వతీశాలు బయలుదేరుతారు. ఒక పార్వతీశానికి మరొక పార్వతీశానికీ లంకె సమంగా కుదరదు. కథలో అనేక అసందర్భాలు పుట్టుకొస్తాయి. మొత్తంమీాద చూస్తే 'బారిష్టరు పార్వతీశం' లో ఇటువంటి అసందర్భాలు ఆట్టే లేవన్నమాట నిజమే కాని లేనేలేవని చెప్పడానికి వీలులేదు.

ఈ కథని కేవలం చదువరులలా మాత్రమే పరిశీలించక కథని వ్రాయదలచుకున్న సమయంలో గ్రంథకర్తలపెట్టిన గ్రంథం ఎటువంటిదో ఆలోచించినట్టయితే నరసింహ శాస్త్రిగారు వ్రాస్తూపడ్డ కష్టాలూ, వారు కష్టాలు తొలగించుకోడానికి చేసిన ప్రయత్నాలూ, ఈ ప్రయత్నాలయొక్క గొప్పతనమూ మనకి బాగా బోధపడ తాయి. చెన్నపట్నం వెళ్లే రైలులోనూ చెన్నపట్నంలోనూ కొలంబోలోనూ స్టీమరులోను ఫ్రాన్సులోనూ పార్వతీశంయొక్క విచిత్రప్రచర్యలూ విచిత్రఘటూహాలూ వర్ణించాలని కథ మొదలుపెట్టేరు. రైలులోజరిగిన విశేషాలన్నీ రైలు ప్రయాణం జీవితం అంతటిలో ఒకటిరెండుసార్లుమాత్రమే చేసినవాళ్ళకి వినోదకరంగా ఉంటాయి కాని అనేకసార్లు ప్రయాణం చేసినవాళ్ళకి అంత వినోదకరంగా ఉండవు. చెన్న పట్నంలో జరిగినవిశేషాలన్నీ ఏదోఒకసారి చెన్నపట్నం చుట్టపుచూపుగా చూసి వెళ్ళిపోయినవాళ్ళకి ఉన్నంత వినోదకరంగా చెన్నపట్నంలో కాపురం ఉండేవాళ్ళకి ఉండవు. చెన్నపట్నం అనేకసార్లు చూసినవాళ్ళకికూడఉండదు. ట్రాముకార్లు మొదటిమాటు చూసినప్పుడు 'బారిష్టరు పార్వతీశం'లోఉన్న ట్రాము వర్ణనలో కనపడే అందం ట్రాములోచచ్చినట్టు ప్రతిరోజూ బ్రొడ్వేప్రయాణంచేసే వాళ్ళకి ఎప్పటికి కనపడదు. కొలంబోలోనూ స్టీమరులోనూ ఫ్రాన్సులోనూ జరిగిన విశేషాలు నిజంగా కొలంబోలోనూ స్టీమరులోనూ ఫ్రాన్సులోనూతిరిగిన వాళ్లుకాని సాధారణంగా

బోధపరచుకోలేరు. మిగిలినవాళ్ళు బోధపరచుకునేందుకని కొన్ని ప్రత్యేకమైన విషయాలనుగురించి హాస్యభావానికి అనుగుణ్యంకాని వివరాలు ఎక్కువగా ఇవ్వవలసుంటుంది. ఈవివరాలవల్ల కథ చప్పబడిపోతుంది. వివరాలు లేకుండా విశేషం ఏమిటో తెలుసుకోగలిగిన వాళ్ళకి అది వినోదకరంగాఉండదు. వివరాలులేకుండా బోధపరచుకునే వాళ్ళకి వివరాలు బోధపరచుకునే సరికి విసుగుపుట్టి కథలో ఉత్సాహం తగ్గిపోతుంది.

130 వ పేజీలో 'మార్సేల్సు'లో హోటలులో ఉన్న 'లిఫ్టుని' ఈ విధంగా వర్ణించారు!

"బంట్రోతు నాసామాను తీసుకువెళ్ళి అక్కడొక చిన్న గదిలోపెట్టాడు. ఆగది ముందు ఇనపకటకటాల తలుపులు మూణవడానికి వీలుగాఉండేవి ఉన్నాయి. గది బొత్తిగా చిన్నదిగా ఉన్నది. అందులో ఒకచిన్న బల్ల ఉన్నది. ఇంత చిన్న గదిలో ఉండడమేలాగు అనుకున్నాను. మంచము వేసుకోడానికి స్థలములేదు సరిగదా, బల్లమీద పడుకుందామనుకున్నా పొడుగు సరిపోయేటట్టులేదు. గదిలోమట్టుకు దీపము వెలిగించారు. గాలి రావడానికి ఎక్కడా కిటికీ అయినా కనపడదు. ఇంతపెద్దహోటలులోఇంత చిన్న గదులేమిటా అనుకున్నాను. అన్నీ యిలాగేఉంటే తక్కినవాళ్ళంతా ఎలా ఉంటారా అనిపించింది. ఒక వేళ నన్నుచూచి లోకువకట్టి ఇంకొకళ్ళకు పనికిరాని గది నాకు ఇచ్చాడేమో ననుకున్నాను. నా తక్కువ మట్టుకేమి ? ఈ గదిలోకి వెళ్ళకూడదనుకున్నాను. సామాను అందులో పెట్టి బంట్రోతు రమ్మన్నాడు. నేను రాను అన్నాను.'

'లిఫ్టు' అంటే ఏమిటో తెలిసినవాళ్ళకి ఇదంత వినోదకరమైన విషయమని తోచదు. 'లిఫ్టు' ఎన్నడూ చూడని వాళ్ళకి వర్ణన కొంతవరకు చదివేక విసుగుపుట్టక మానదు. ఇటువంటిఉదాహరణలు కథలో అనేకం చూపించవచ్చును.

ఈ కారణంవల్ల 'బారిష్టరు పార్వతీశం' అందరిలోనూ అన్ని కాలాలలోనూ సమానమైన ఉత్సాహం పుట్టించదు. కొందరు కొన్నిభాగాలు చదువుతుంటే మాత్రమే ఆనందిస్తారు. మరికొందరు మరికొన్ని భాగాలు చదువుతుంటే మాత్రమే ఆనందించగలరు. ఈ ఆనందించడమైనా చిన్నప్పటి దొకతీరు; పెద్దవాళ్ళయాక ఒకతీరు. కాని అన్నిభాగాలూ అందరికి వినోదకరంగా ఉండడం అసంభవం. ఆ లోపం కథలోనే ఉంది.

కథాపోషణలో ఇటువంటి కష్టాలన్నీ ఉన్నాయని గ్రహించినట్లయితే నరసింహశాస్త్రి గారు ఇన్ని కష్టాలూ చాలావరకు దాటి ఈమాత్రం వినోదకరమైన గ్రంథాన్నైనా రచించినందుకు ఆంధ్రులందరూ సంతోషించవలసిం దవును.

అనేక సంవత్సరాలబట్టి నరసింహశాస్త్రిగారు 'బారిష్టరు పార్వతీశాని'కి రెండవభాగం వ్రాసినట్టూ ప్రచురించబోతున్నట్టూ వింటూఉన్నాము. వారి స్నేహితబృందంలో రెండవభాగంయొక్క వ్రాతప్రతి చూడకపోయినా అటువంటి వ్రాతప్రతి ఉందనిన్నీ ఎప్పుడో ఒకప్పుడు నరసింహశాస్త్రిగారు దానిని తమకు చూపిస్తారనిన్నీ నమ్మే పెద్ద మనుష్యులు కొందరున్నారు. మొదటిభాగానికి ఎవరైనా చూపించగలిగే అత్యంతా దరణ ఏమిటంటే, రెండవభాగం కోసం ఎదురుచూస్తూ ఉండడమే !

# లోన-బయట

### పద్మరాజు

ముడుతవడనట్టి నాదుకన్బొమలలోన
వ్యక్తమగు శాంతసరళభావములెగాని
హృదయ కుహరమ్ము జుట్టి దహించు ననల
కీలికలు నాలుకలుసాచి క్రిందుమీదు.

ఈమహాగ్ని కాహుతి యయి నామనోజ్ఞ
హృదయ కుసుమంబు వాడి శుష్కించిపోవు
దినదినంబును గాని, నామనసునందె
అడగిపోవు నీబాధాకులానుభవము.

అనుభవింపని సుఖములె అస్మదీయ
చిత్తజలధి మధించివైచెదు సతంబు
కనులబడని యానంద లోకముల జూచు
తృష్ణయే ఘోరభుజగియై యెడదనెల్ల
కలయ బ్రాకుచు విష వర్షములను గురియు.

రేయినలసినకనులకు రెప్పవేసి
లోకచిత్రంబు మాయగల్గుదునెగాని,
లోన చెలరేగు నల్లకల్లోలమునకు
కనులుమూసి నిద్రింపజాలను క్షణంబు.

అయిన వార్ధిగర్భపుబడబాగ్నియట్లు
ఒక్కకణమైన చెదరి పైకురుకరాదు
ముడుతవడనట్టి నాదు కన్బొమలలోన
వ్యక్తమగు శాంత సరళభావములె సతము.

# మేము

## వట్టికొండ రంగయ్య

౧

బాలసహకార మృదుపల్లవములు మెక్కి
శ్రుతిసుఖమ్ముగ పంచమశ్రుతి లగించి
కూయుచున్నావు, కోయిలా కొసరి కొసరి
అంతకైనను నోచుకో మైతి మేము.

౨

త్వన్మనోహర కంఠరవమ్మ నేని
క్రిందిపరుపంగ జాలు మా మృదు మనోజ్ఞ
మధురగళ మెత్తి యొకసారి మాతృగీత
ములను మన సూర పాడగా వలనుపడదు.

౩

స్వాదుసురభిళ సుమరసాస్వాదమత్త
మధుప ఝుంకారరవ మేని మరవజేయు
కూనరాగాన కమ్మగా గోర్కి దీర
పాడుకొనుభాగ్య మేనియు పట్టలేదు.

౪

ఎట్టకేలకు కలము చేపట్టి యైన
భయదరిపుదాస్య శృంఖలాబంధనమున
చివికి, కృశియించి, జీర్ణమై శిథిల మైన
జననిభారతి నోదార్ప జాల మకట!

# "చాలనీ"

(పుస్తక సమీక్ష)

1/38

## స్వార్థత్యాగము

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటమహీపతి
గంగాధరరామారావుగారు కర్త.
ముద్రణ : పిఠాపురం
విద్వజ్జనమనోరంజనీ ముద్రాశాల.
౧౦౪ పుటలు - వెలలేదు.

ఇది శ్రీపిఠాపురం యువరాజావారు వ్రాసిన నాలుగంకాల సాంఘిక నాటకం. శ్రీయువరాజావారు ఆంధ్రవిద్వల్లోకానికి రసజ్ఞులుగా సహృదయులుగా మాత్రమేకాక, అప్పుడప్పుడు పత్రికలలో ప్రకటిస్తూవచ్చిన ఖండకావ్యాలవల్ల, కవితానిపుణులుగా కూడా సుపరిచితులు. ఈనాటకపీఠికలో సెలవిచ్చినట్లు వీరు 'స్వాభావికముగా హృదయము విజృంభింపగా' వ్రాస్తారు. 'భావాలను సరిగా చెప్పడానికి మాటలకు శక్తిలేదు' అని శశాంకుడిచేత అనిపించారేకాని హృదయములో దూరి అక్కడ నిగూఢంగా ఉన్న సంచలనములనూ, మనసులో మూలమూలల రేగేభావాలనూ వ్యక్తీకరించే గొప్ప ప్రజ్ఞ వీరి కలవడ్డది.

ఈ నాటకంలో ఇతివృత్త మిది:

విద్యుల్లతా తుషారకణలు ఉన్నతవంశమందు పుట్టి పాశ్చాత్యదేశాలలో ఉన్నతవిద్య అభ్యసించిన విజ్ఞానవతులు. తమకు సుపరిచితుడైన శశాంకుడనే యువకునియెడల అనురాగబద్ధలై ఉంటారు. శశాంకుడు వారిద్దరితోనూ చనవుగా స్నేహంగా మెలగుతూ ప్రణయపూరితంగా ప్రవర్తిస్తూఉండడమువల్ల ఒకరిమీద ఒకరికి అసూయ కలుగుతుంది. వీరిలో తుషారకణది బలవత్తరమైన ప్రకృతి. 'రెండు సూదంటు రాళ్ల మధ్యపడ్డ ఇనుపముక్కను' తుషారకణ ఆకర్షించి తనవశం చేసుకొంటుంది. విద్యుల్లతకి వార్త పిడుగు పైబడ్డట్టుగా ఉంటుంది. జీవితమంతా అసారంగా శూన్యంగా పొడగట్టుతుంది.

చారుదత్తుడనే యువకుడికి విద్యుల్లత మీద అమితమైన ప్రేమ. ఆమె తండ్రి వినయభూషణుడికి చారుదత్తుడు, శశాంకునివలె అస్థిరచిత్తుడు కాకపోవడం వల్ల, ఎక్కువ నచ్చాడు. తండ్రి భావం ఎరిగిఉన్నా అతనిని వివాహం చేసుకోవడం తన కిష్టములేదని మొదట చెప్పివేసింది. శశాంకుని వివాహం ఆయి పోయిన తరవాత కూడా అతడే తన ప్రాణవల్లభుడని మనసులో ఎంచుకొన్నది. కాని తండ్రిని సంతోషపెట్టడము తనకు విహితధర్మమనీ అవ్యాజ ప్రేమ పూరితుడైన చారుదత్తుని నిరాకరిస్తే తానను భవిస్తూ ఉన్న బాధ అతనికి కలుగుతుందనీ భావించి స్వార్థత్యాగ బుద్ధితో తండ్రి మాటప్రకారం అతనిని వివాహం చేసుకొంటుంది. మూడేళ్లు గడచిన తరువాత విద్యుల్లతా చారుదత్తులు వినయభూషణుని తీసుకొని యూరపు ప్రయాణానికి సిద్ధపడుతూవుండగా వివాహానంతరం అమెరికా వెళ్ళిన శశాంకుడు తుషారకణ కక్కడ విడాకు లిచ్చి స్వదేశం తిరిగివచ్చి విద్యుల్లతను కలుసుకోడానికి వారింటికి వస్తాడు. అతనిని చూడడం విద్యుల్లతకు ఇష్టంలేదు. కాని హృదయంలో ఏదోఒక విధమయినబాధ అనుభూత మవుతుంది. శశాంకుడు తుషారకణకూ తనకూ అభిప్రాయాలలో, అభిరుచులలో ఎట్లుభేదాలు ఏర్పడ్డవో ఎట్లామె తనను అస్వతంత్రుణ్ణిచేసి వేసినదో తెలిపి విడివడడమే ఇద్దరికీ కూడా శ్రేయస్కరమని నిరూపిస్తాడు. ఇంతలో

చారుదత్తుడు తనకోసం ఎవరో వచ్చినందువల్ల బయటికిపోగా విద్యుల్లత లోని భావాలు అణచుకో లేక శశాంకునిపై తనకున్న అగాథప్రేమ వెల్లడిచేస్తుంది. శశాంకుడు ఆమెను స్వాధీనంచేసుకోవలెనని ఉద్యమిస్తాడు. ప్రేమదాచవద్దని లోకానికి భయపడవద్దని హెచ్చరిస్తాడు. ఆమె గృహిణీ ధర్మానికి విరుద్ధంగా ప్రవర్తించడానికి ఇష్టపడక స్వార్థత్యాగమే మానవధర్మమని బోధించి అతనిని వారిస్తుంది. చారుదత్తుడు వారి సంభాషణవిని స్వార్థత్యాగ మంత్రం అవలంబించి విద్యుల్లతా శశాంకులను తనఆస్తిఅంతా తీసుకొని యూరపు పోయి పెండ్లిచేసుకొని సుఖంగా వుండమని కోరుతాడు. అతని మాటలలోని ఔదార్యం విద్యుల్లతను ముంచివేస్తుంది. తనను విడిచిపెట్టి పోవద్దని బ్రతిమాలుతూ వాని పాదాలమీదవాలి స్మృతిదప్పి పడిపోతుంది. తండ్రి, శశాంకుడు, చారుదత్తుడు, అప్పుడే ప్రవేశించిన తుషారకణ నిశ్చేష్టులై విలపిస్తారు.

ఈ నాటకములో మనోహరమైన సన్నివేశాలు, ఉత్కృష్టమైన ఆదర్శాలూ సున్నితములయిన భావాలూ ఉన్నవి. పాత్రపోషణము ఎంతోరమ్యంగా ఉన్నది. తాను వరించిన పురుషుణ్ణి ఆకర్షించి, అతడింకొకరికి లోబడకుండా కాపాడుకొని, స్వాధీనము చేసుకొని, వివాహమాడి, తన చెప్పుచేతలలో ఉండేటట్లు నొక్కిపట్టే తీవ్రప్రకృతిగల తుషారకణకూ, అగాధమైన ప్రేమా, దాని ననుసరించి వచ్చే ఈర్ష్యఉన్మాదాల వాంఛను ఆత్మసంయమనము వల్ల అణచిపెట్టుకొని ప్రేమవిఫల మయినప్పుడు ధైర్యమువహించి పితృసేవ, స్వార్థత్యాగము పరమధర్మాలనిభావించి సౌశీల్యమును కాపాడుకొన్న విద్యుల్లతకూ ఉన్న తారతమ్యము చక్కగా నిరూపితమయినది. శశాంక చారుదత్తుల శీలముల లోని ఈవిధమయిన భేదమే నిపుణంగా ప్రకటితమయినది. వినయభూషణుడి ఏకైక పుత్రికా వాత్సల్యమూ, ఇహపరసాధకాలని చెప్పి అతడు విద్యుల్లతమనస్సు బాగా లేనప్పుడు భగవద్గీతా శ్లోకాలు చదవమనడమూ అహ్లాదకరముగాఉన్నవి నాటకములో మొదటినుంచి చివరదాకా సంభాషణ చాలా సహజంగా రసవంతంగా సంతతధారగా నడుస్తుంది. నాటకపాత్రలందరూ పాశ్చాత్య వాతావరణ సంపర్కంవల్ల మాట మర్యాదలలో అక్కడక్కడ పాశ్చాత్యానుకరణంచేసినా అది రసపోషకముగానే ఉన్నది.

ఈ గ్రంథము ఇంతచక్కగా రచించిన శ్రీ యువరాజావారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము. వీరి సరసలేఖిని నవ్యసాహిత్య పోషకముగా ఉండునుగాక! — తె. వెం. ర.



## తరంగములు

కవి: శ్రీరావు వేంకటమహీపతి గంగాధర రామారావుగారు, పిఠాపురం యువరాజా.

ప్రథమ ముద్రణము ౧౯౩౭

పుటలు ౬౮. వెలలేదు

ఈగ్రంథము అయిదు రసవత్ఖండకావ్యములతో కూడిన చక్కని చిన్నిసంపుటము. ఇందలి కావ్యములు కొన్ని ఈవరలోనే భారతిమాసపత్రికద్వారా అప్పటప్పట ప్రకటింపబడి ఉన్నందున మాకు పూర్తిగా అపరిచితములుకావు.

ఈగ్రంథములోని శీర్షికలలో ఒకటి "ఆంధ్ర సాహిత్యపరిషత్తు" వారి రజతోత్సవసంచికలో ప్రచురణమైవుంది. ఆసంచికని "ప్రతిభ" పత్రికలో విమర్శచేసే సందర్భంలో శ్రీ యువరాజావారి కావ్యము "ప్రతిభ" కు పంపదగినదని విమర్శకులు నిర్ణయించారు. అంటే ఆకావ్యంలో నవ్యకవిత్వ సహజమైన లక్షణాలేవో వారిదృష్టి నాకర్షించి వుంటాయి.

ఈసంపుటమంతా మాదృష్టినికూడా అరీతిగానే ఆకర్షిస్తోంది.

నవ్యకవిత్వానికి ముఖ్యలక్షణం ఆత్మానుభవాలు కవిత్వంలో ప్రతిబింబితం కావడం అని మా నమ్మకం. కవి తన జీవితంలోని లోతైన ఘట్టాలని తనకు తానే నిరాతంకంగా, స్వతంత్రంగా, ఉచ్ఛ్వాస నిశ్వాసాలమాదిరిగా వెళ్లబోసుకొని, తన ఆనంద శోకాలు విశ్వవలయాన్ని ఆలింగనం చేసుకొనగలిగినంత విశాలం చేసుకొని, అట్టి మహదనుభూతిని స్వతస్సిద్ధంగా వ్యక్తం చేయడమే నవ్య కవిత్వానికి పరమాశయము. ఈ దృష్టితో విమర్శిస్తే నే శ్రీ యువరాజా వారి కవితా హృదయం పాఠక హృదయానికి అప్తమై రంజన గొల్పుతుంది,

"వేణునాదంబు నాలింప వేడ్కపడుచు ఢీకరా క్రోశరావమే విన్న" ఆవేదనా, "మిణుగురు పురువులనుజూచిమింటనుండితారలని" యెన్న జాలినఆశయశీలమూ, "ఏడ్వనేడ్వగ కన్నీళ్లు యెండిపోవ, ఏడ్వలేకయె మనసులో నేడ్చిన" నిస్సహాయుడగు పాంధునిపై సానుభూతీ, ఇట్టి సుకుమార భావనలోని నవ్యత వేరుగా వెలెత్తి చూపనగత్యములేదు.

శ్రీ యువరాజా వారిది సరళమైన శైలి. హృదయంలోనించి ఉప్పొంగిన భావాలను ఉన్నదున్నట్లుగా "అర్థముకాని భావగీతాల" వలె కాక సుస్పష్టంగా, సహజమైన పదజాలంలో వెలిబుచ్చుతారు. కవి ప్రణయపథవిహారి యైనప్పుడు తన "భావయుత పరీరంభ సంరంభవేళ" ను "పుష్పసందోహముల్ పుష్పంధయుని జూచి తలలూచెమముజూచి పులకరించి" అనీ "మేఘమాలలు గుంపుమేరునగముజూచి చెయిచాచె మముజూచి సిగ్గువిడిచి" అనీ చెప్పినపుడు ఏదోఅమాయిక చమత్కారము ముచ్చటలొలికిస్తుంది. అంతట ఆప్రేమ "పర్వతశిఖరాగ్ర పార్శ్వభాగంబుల మెరసి" "సాగరవాహినీ సంగమస్థలముల స్రవియించి" "కలకంఠకుల కలకల నినాదంబుల" బాడగా తుదకు కవి ముక్తకంఠంతో

"విశ్వమంతయు మా ప్రేమవికసనంబె,
శబ్దమెల్లను మా ప్రేమసారరవమె,
సర్వకాలంబు నిది యిట్లె శాశ్వతంబు,
యిట్టిసంబంధ మెచ్చట నేని గలదె?"

అని ఉద్ఘోషించాడు. మాహృదయానికి యీ కావ్యం చాలా చేరువ గడించుకుంది.

ఇంకోగీతంలో :

"సలలితకవితను
భావతరంగ ప్రవాహధాటి
కలియగా శృతిమైచి కర్ణపేయంబుగా
బాడగానున్న దీ ప్రాణవీణ
మిన్ను విడనాడి రమ్మింక మెఱపురాణి!"

అని అతిమంజులంగా ఆవాహన చేశారు.

"నవ్వకోయ్ నవ్వకోయ్ నవ్వితే తప్పు
నొవ్వకోయ్ నొవ్వకోయ్ నొవ్వితే తప్పు"

అని ఆరంభమైన "అవ్యక్తునిగానము" లోకంలోని అవ్యక్తమైన వైపరీత్యానుభూతులను చాలా తమాషాగా వ్యక్తం చేస్తుంది. స్వాతంత్ర్యాకాంక్ష ఎంతనిరాఘాటమైనదో, తద్విజృంభణము అరికట్టిన యెడల ఎట్టెట్టి వైపరీత్యములు జగత్తులో ఉద్భవిస్తాయో, ఈ కావ్యములోని క్రింది పంక్తులలో వ్యంగ్యంగా సూచింపబడినట్లు మేము ఊహిస్తాము.

"పంజరంబునువీడి పక్షియుబార
నీయేడ్పుజూచుచు నేనవ్వుచుంటి
నాయేడ్పుజూచుచు నవ్వెనా వీవు."

*

అంత :

"ఉదయించె సూర్యుండు ఉత్తరమునను
కదలెను పరువెత్తి ఖండంబులెల్ల
కొండకు నెగబ్రాకె ఘోషింపునదులు

*

చెరుకురసంబులో చేదునుపుట్టె
తరచయ్యె మేఘాల దావాగ్నులపుడు."

శ్రీపిఠాపురం యువరాజావారు తమ యువజీవితా శయాలనీ ఆవేదనలనీ కవితారూపంగా వ్యక్తం చేయడం మేము చాలా అభినందనీయంగా భావిస్తున్నాం. కావ్యకల్పనలో వీరికిగల లలితమైన పిపాస మరీమరీ సఫలమై, పరిపక్వమై, నవ్యాంధ్ర సాహిత్యానికి అనేకనవనవాలంకారాలని కానుక చేయగలదని హృదయపూర్వకంగా ఆశిస్తాము.

"విశ్వం"

## శ్రీరమణ చరిత్రము

గ్రంథకర్త : ఓరుగంటి వెంకటకృష్ణయ్యా, బి. ఏ. బి. ఎల్.

పీఠికాకారుడు : దుర్భా సుబ్రహ్మణ్యశర్మ

పీఠిక XX పుటలు; పరిచయము X పుటలు;

గ్రంథము 394 పుటలు;

38 చిత్రపటములు

అట్టబైండు, చక్కనిఅచ్చు, మంచికాకితాలు. వెల రూ 1-4-0

ప్రకాశకులు : శ్రీనిరంజనానందస్వామివారు శ్రీరమణాశ్రమము: తిరువణ్ణామలై.

[౧]

"ఈ గ్రంధము ప్రాయికముగా నరసింహస్వామి వారి యాంగ్లగ్రంధమున కనువాదమే. అట నట స్వామియు నితరులును దెల్పిన కొన్ని విషయముల జేర్చితిని; విషయక్రమమును మార్చితిని. సంభవముల నుండి అనుమానముల (Inference) గ్రహించుట యం దించుక స్వాతంత్ర్యము నవలంబించితిని"అని గ్రంధకర్త విన్నపములో వ్రాశారు.

ఈ గ్రంధమును చదువుతున్నప్పుడు అనువాద గ్రంధ మనిపించదు. స్వతంత్రముగా వ్రాసినగ్రంధము వలెనే తోస్తుంది. మహర్షులవారి సముఖమందుండి, మహర్షులవారిసల్లాపాలువుచ్చుకొంటూ వ్రాయడం అందుకు కారణం.

పీఠికాకారులు మహర్షులవారిని గురించి ఈ విధముగా వ్రాశారు. "మంచుకొండ దగ్గతినవారికి జలి యొక్కయు, అగ్నికుండముదండ నుండువారికి వేడిమియొక్కయు ననుభూతి యె ట్లనివార్యమో, వారి నైకట్యమున నెంత వ్యాకులితేంద్రియునకైనను ఆనంద మనివార్యము." ఈ వాక్యము అక్షరాలా మహర్షులవారిపట్ల చెల్లుతుం దని ఈ గ్రంథము చదివినవారికీ, వారిదర్శనము చేసినవారికీ తెలుస్తుంది.

ఈగ్రంథము మూడుఖండములుగా విభజించారు. మొదటి ఖండానికి "అవతారము"అనిన్నీ, రెండో ఖండమునకు"అనుగ్రహము""తపోవనము"అనిన్నీ, మూడో ఖండమునకు "వర్ణన"అనిన్నీ పేర్లు. ఈఖండములు మళ్ళీ వేర్వేరు ప్రకరణాలుగా విభజించారు

అవతారము :

ఇందులో శ్రీరమణమహర్షులవారి బాల్యము, విద్యాభ్యాసము, తిరువణ్ణామలై ప్రయాణము,అక్కడి తపశ్చర్య వర్ణితములు. శ్రీరమణమహర్షులవారు కుమారస్వామి అవతారమనికూడా ఇందులో నిరూపించారు.

మధురకు ముప్పైమైళ్ళ దూరములో ఉన్న తిరుచ్చుళిగ్రామములో శ్రీరమణమహర్షులు బ్రాహ్మణ కుటుంబాన జన్మించారు. విద్యాభ్యాసము కొంత వరకు జరిగినపిమ్మట పదహారవయేట "తిరువణ్ణామలై" అనే పుణ్యక్షేత్రముపేరు ఆయన చెవులబడ్డది. ఏదో పూర్వస్మృతికలిగేసరికి వారు ఇంట్లో చెప్పకుండా తిరువణ్ణామలెకు ప్రయాణమైపోయి మిక్కిలి కష్టముతో అచటకు చేరుకొని తక్షణమే అరుణాచలేశ్వరుని గర్భాలయము ప్రవేశించి "అప్పా, నీయప్పనమేరకు వచ్చితిని,సర్వమును విడిచితి నని విన్నవించెను." నాటినుంచి నేటివరకూ మహర్షులవారు అరుణగిరినే ఆశ్రయించి ఉన్నారు.

అరుణగిరి ప్రవేశించినపిమ్మట మహర్షులవారు అనేకచోట్ల కూర్చుండి కఠినతపస్సు చేయసాగినారు. మౌనవ్రతము పూనారు. బాలకులు పెట్టే హింసలను సహించారు. "ఈ తపఃప్రవృత్తి నిరాకార బ్రహ్మానుభూతికొరకే. ఈకాలమున పలువురు భక్తులు స్వామికి ఆహారాదులు ఇస్తుండేవారు. పరిచర్య చేస్తుండేవారు. అరుణాచలముయొక్క మహత్తును మహర్షులవారే తాము తరువాత రచించిన "అరుణాచలదశకమున" ఈ రీతిగా వర్ణించారు.

"ఈయరుణాచలము వింతయైన కాంతము. ఇది చేతను లైనజనులనే యాకర్షించును. వారిచేష్టలను హరించును. అంతవిడువక మఱియు లాగికొని తన సన్నిధిని చేర్చికొనును. అంతకును గడువదు. తనవలెనే అచలస్వభావ మిచ్చును. అంతనైన వదలక రుచిగలయాహార మని వారిని మ్రింగివైచును. జనులారా సావధానులై జీవింపుడు."

[౨]

కమండలం, కౌపీనం, కర్ర - ఇవే రమణమహర్షి సహచరులు. మూడులోకాలనూ జయించే సామర్థ్యము వీటి కుంది. మనిషిని భాగ్యవంతునిగా చేసేది ఇవే!

అరుణాచలము జ్యోతిర్లింగము. జ్ఞానరశ్మియెప్పుడూ ఉద్గత మౌతూంటుంది. అరుణాచలేశ్వరుని ముద్దుబిడ్డడు రమణభగవానుడు - తారకాసురుణ్ణి సంహరించడానికి అవతరించాడు. క్రౌంచాచలమును భేదించడానికి అవతరించాడు!

లోకములో అజ్ఞానమునూ, ద్వేషమునూ, అసహనమునూ, సంహరించడానికి అవతరించాడు. మౌఢ్యమునూ నాస్తిక్యమునూ భేదించ నవతరించాడు.

రమణభగవానుని దర్శనము చేసుకొని సంశయాత్ముడు ఆస్తికు డౌతున్నాడు. రమణభగవానుని దర్శనము చేసుకొని అర్తుడు అనునయము పొందుతున్నాడు. అర్థులకు రమణదర్శనము జ్ఞానభిక్ష పెట్టుతోంది. జ్ఞానులకు రమణదర్శనము అద్వైతసిద్ధి నిస్తున్నది. అరుణాచలేశ్వరుని కౌగిట పార్వతి అంకతలమున కూర్చుని రమణభగవానుడు భూతకోటి కంతకీ ఆనందము పంచిపెట్టుతున్నాడు. మనుష్యులే కాదు, పక్షులూ, మృగములూ, మొక్కలూ రమణభగవానుని అనుగ్రహభాగ్యమును పొందుతున్నవి.

భగవంతుడు లే డని కాని, భగవంతుడు పక్షపాతి అని గాని సందేహిస్తున్నావా? —రమణభగవానుని దర్శనము చేసుకో.

సంసారభారాన్ని మొయ్యలేక బాధపడుతున్నావా? రమణభగవానుని దర్శనము చేసుకో.

బ్రహ్మానుభూతి నమ్మదగ్గది కా దని కాని, సాధ్యము కాదని కాని సందేహిస్తున్నావా? రమణభగవానుని దర్శనము చేసుకో.

జ్ఞానతేజస్సులో స్నానం చెయ్యాలని మనసు పుట్టిందా? రమణభగవానుని దర్శనము చేసుకో.

నే నజ్ఞానిని, దీనుణ్ణి, పాపిని అని దిగులుపడి నిరుత్సాహము పొందుతున్నావా? - రమణభగవానుని దర్శనము చేసుకో.

మనస్సుకూ, వాక్కుకూ అందని అత్యున్నతశిఖరముమీద ఉన్నాడు రమణభగవానుడు.

కాని రమణభగవానుని కటాక్ష మందరికీ అందుబాటులోనే ఉంది.

రమణభగవానుని కటాక్షములో పరబ్రహ్మ నిత్యమూ తాండవకేళి సల్పుతూ ఉంటాడు.

రమణభగవానుని కటాక్షము నిత్యమూ శాంతినీ, జ్ఞానమునూ వర్షిస్తూ ఉంటుంది.

ఆకటాక్షసుఖమును అనుభవించకోరిక ఉందా? —రమణభగవానుని దర్శనము చేసుకో.

రమణభగవానుని కలములో వాణి నృత్యము చేస్తూ ఉంటుంది. జ్ఞానబోధ కావలెనా? రమణభగవానుని గ్రంథములు చదువుకో.

అల్పమైన ఆయుర్దాయాన్ని పాడుచేసుకోకు. ఓపిక ఉండగానే రమణభగవానుని దర్శనము చేసుకో.

ఈవార్తలలో అతిశయోక్తి ఉన్నదని సందేహిస్తున్నావా? లేదని నువ్వే చెప్పగలవు రమణభగవానుని దర్శనము చేసుకొని.

ఇట్టి రమణభగవానుని దివ్యకథ చదువు రమణమహర్షులవారి జననాదికమున్నూ, అరుణాచలమును వారు చేరుటయున్నూ, అక్కడ ఉగ్రతపస్సు చేయడమున్నూ, బ్రహ్మానుభూతిన్నీ మొదటిఖండంలో వర్ణితములు,

గ్రంథావలోకనమున్నూ, గ్రంథరచనాప్రారంభమున్నూ, శిష్యకోటిని వారు అనుగ్రహించిన విధమున్నూ, ఆశ్రమస్థాపనయున్నూ రెండవఖండములో వర్ణితములు.

ఆశ్రమములో నిత్యచర్యయున్నూ, వారి ఉపదేశమార్గమున్నూ, వారిమహిమలున్నూ మూడవఖండములో వర్ణితములు.

పాల్ బ్రింటను ఇత్యాదివైదేశిక శిష్యుల అనుభవాదులున్నూ శేషాద్రిస్వామి గణపతి మునుల చరిత్రలున్నూ అరుణగిరి విశేషాలున్నూ సందర్భానుసారంగా వర్ణించారు.

"ఉపదేశసారము: ద్రావిడదేశమునం బ్రాచీన కాలమునుండియు నొకగ్రామీణనృత్యము కలదు. పాదవిశ్రామముల "నుందీపక" అని వర్తకు లందురు. దీని కొక ఛందస్సు, గతి, తమిళసాహిత్యమున నిర్ణయింపంబడియున్నవి. అఛందస్సు నవలంబించి స్వామి ఈగీతమును (ఉపదేశసారము) వ్రాసినారు. శిష్యు లాకరన్నట్లు ఉపమానపూర్వక రచనము సామాన్యులకు రుచించును గాని దర్శన సముద్రమథనోత్సాహులకు సిద్ధాంతవాక్యములందే యెక్కువ యాదరము. కావున మహర్షి ఇందు సిద్ధాంతవాక్యముల మాలాకృతిగ ఛందస్సున నిబంధించియున్నారు. ఇందు శరీరము లేక కర్మము జడము, కర్త ఫలదాత" యనుచు పూర్వమీమాంసాఖండనమున నుపక్రమించి క్రమక్రమముగ కర్మ, భక్తి, జ్ఞానమార్గముల మథించి యేతీననూత్రరత్నములచే నద్వైతమాలను రచించినారు.

దీనిసారము: కామ్యకర్మము ఫలయుక్తము, ఫలమశాశ్వతము. కావున నిష్కామకర్మ ముత్తమము. ఉత్తమకర్మ మీశ్వరపూజనము. దీనియందు ప్రపంచసేవయే అష్టమూర్తిధృద్దేవపూజ యనుభావన వలయును.

జపము: దీనియందు భేదములు-శబ్దము ననుసరించి - స్తోత్రము, వాచికము, ఉపాంశువు, చిత్తజము.

చింతనము: విరళచింతన, సరళచింతన, క్రమముగ ఉత్తమములు.

తరువాత భక్తియోగము: భేదభావనకన్న నభేదభావన యుత్తమము. భక్తిచే భావనను స్వస్థలమునం జేర్పవలయును.

ఇట్లు నిష్కామ భక్తియుత కర్మయోగము ప్రతిపాదించినారు.

ఈరీతిగానే యోగము తత్కారణము లయవినాశము అనురెండుపద్ధతులు చర్చించారు. తరువాత విచారమార్గమున - విచారము, జ్ఞానము చర్చితములైనవి. బ్రహ్మాత్మస్వరూపము, ముక్తి, ఇవియు వర్ణితములు.

"ఇది తమిళదేశీయులకు మాత్రము లభ్యమైయుండుటను జూచి రామయోగి తెనుగున రచింపు డని కోరంగా స్వామియే దీనిని ద్విపదగా తెనుంగుం జేసిరి. సంస్కృతమున స్వామియే శ్లోకరూపమున రచించిరి. పిమ్మట మళయాళమునను ఇది ప్రవర్తితమైనది. నరసింహాస్వామి దీనిని ఆంగ్లేయమున రచించియున్నారు."

"మనుజుడు తాను సహజముగ పాపి, శక్తిహీనుడని యనుకొనుట పెద్దపొరపాటు మనుష్యుడు దివ్యుడు, యథార్థముగ నతనిసత్త మిక్కిలి సత్య

వంతము. బలహీనములు దుష్టము లైనవి అతని యలవాటులు కామములును వృత్తులేగాని అతఁడు కాదు"

స్వామి మతసారాంశము: ఆత్మ నెఱుంగుము. సర్వము తెలియును, లభించును. ఆత్మ నెఱుంగు మార్గము మనోవృత్తి మూలమును వెదకి యందు లీన మగుట. దీని కుదాహరణమే ఈ పుణ్యచరిత్రము.

చింతా దీక్షితులు.



## కలిక

బొడ్డు బాపిరాజు 38 | 1

యువకార్యాలయం - తెనాలి

వెల ౪ అణాలు

బొడ్డు బాపిరాజుగారు ఇదివరలో కవిగానే ప్రసిద్ధి వహించారు గాని కథకుడుగా బయట పడలేదు. వీరి 'కలిక' కథాలోకంలో ఒకవిశేష స్థానమును ఆక్రమించుకుంటుంది. ఈయన పద్యాలలో కంటె ఈవచన రూపంలో ఒక ప్రత్యేకత గోచరిస్తున్నది. పద్యాలలో ఈయనపోకడ పురాతనత్వాన్ని విడనాడనూ లేక నూతనత్వానికి దగ్గరగా చేరనూ లేక మధ్యస్థంగా ఉంటూ వచ్చింది. ఈవచనరచనలలో ఈకవి చాలవరకు చిన్నకథలని పిలువబడు కథానికలకు ఒక మెచ్చుకు దగ్గ రూపమును కల్పించినాడు. కొన్నిటిని కేవలం కథలనడం కంటె ఊహా చిత్రాలంటే (Sketches) సరితూచిన ట్లుంటుంది. అందులో మొదటిది 'అతీతం.' దీనిలో 'కలిక'మను మాటకు గల సాధారణార్థము బాగా ధ్వనిస్తున్నది. నేటి ఖండకావ్యములలో బాగా పోషింపబడుతున్న 'రసధ్వని' ఈ కథలలో కూడా నిండి ఉన్నది. 'అతీతం'లో ఒక ధనికుడు, ఇద్దరు నిరుపేదలను చేరదీయడము, లోకనిందను తృణీకరించడము ముఖ్యాంశములు. దీనిలో ఒక అనుకోని క్రొత్త మలుపు వల్ల, దగ్గరికి చేరదీసి తాను ప్రేమించిన బీద బాలికను మరొక తోటిపేద కిచ్చి వివాహము కావించినాడు. ఇటు వంటి అనుకోని మలుపులు, 'కరుణాలింగిత చిత్తమధనలూ' అద్భుతపరివర్తనాలూ, మొదలయిన వాటితో కూడుకొన్న కథానికలు ఇవి.

ఈ కథలలో వస్తు సందర్భములు చాలవరకు మధ్యతరగతి (Middle class) జీవితములోనుంచి తీసుకోబడినవి. 'ఏకోదరు'లనే కథలో నేటి పాలేరుల సంతృప్తి పొందిన గ్రామ్యజీవనములో పట్నవాసపు నాగరికత రుచిమరగిన ఒకపడుచు కలిగించిన పరివర్తనము విషాదాంతమయినది. ఈకథమిగతావాటికంటే బాగా రాణిస్తున్నది.

ఈయన వర్ణనలు కథావస్తువుకు దూరముగా పోక పాత్రల చిత్తమధనల ననుసరించినవి. కథలన్నీ అధునిక జీవిత ప్రతిబింబములు. ప్రతి కథా చివరదాకా చదివిన పిదప చదువరి మనస్సులో ఆలోచనలకు సంచలనము కలుగుతుంది. కవిత్వంలోని భావౌన్నత్యము కథలలో కూడా ఇమిడి శోభను తెస్తున్నది.

దే. కృ.



## రూపాయి టులెట్

కర్త: పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి

యువకార్యాలయం, తెనాలి.

వెల 4 అణాలు.

ఈ ఆరుకథలూ ఒక్క-సారిగా చదివెయ్యొచ్చు. చాలా సులభశైలిలో చక్కని ధోరణిలో వ్రాయబడ్డవి.

చిత్రకళలను వ్యంగ్యచిత్రాల్లాగ (Caricatures), చిన్నకథల్లో యిట్లాంటి వినోద కథల వల్ల కూడా కొంత సారస్వతసేవ జరుగవలసివుంది.

అగ్ని

పానుగంటివారి 'సాక్షి' 'భమిడిపాటివారి' రచనల తర్వాత, మనలో అట్లాంటి హాస్యరచయితలు చాలా తక్కువమంది ఉన్నారు. కవిత్వంలోని గూఢత్వము (Mysticism) కొ స్త్రరుగా హాస్యములోగూడ త్వరగా స్ఫురించనివి కొన్ని ఉంటాయి కాని బాలకృష్ణశాస్త్రిగారి హాస్యము ఇంకా ప్రౌఢత్వమును కుదించుకొనలేదు. ఇప్పటిరోజులలో కాలేజి విద్యాభ్యాసంగమువలన కొందరికి అలవడే నిరుద్యోగజీవనము, ఆడంబరత్వము, శుష్కాదర్శ పరత్వము మొదలైన చిత్తవృత్తులు సాంఘికజీవనంలోక్రింది మెట్లులకు సంబంధించినవి. వాటిని కళ్లకు కట్టేటట్లు ఈయన చక్కగా చిత్రించాడు. "రూమ్‌టులెట్"లోని నారాయణమూర్తి "పాటకచ్చేరి"లోని నాను ఇందుకునిదర్శనాలు. 'వినోదకథల సంపుటి' అయినప్పటికీ శైలిలో కొన్ని కట్టుబాట్లవసరం. "కంటనే నారాయణమూర్తికి Love at first sight అయింది" "ప్రపంచకాన్ని ఉద్ధరించే ఒక గొప్ప idea తట్టినవాడిలాగా." ఇల్లాగే ఆంగ్లపదాలు గ్రంథంలో అక్కడక్కడ ఉపయోగింపబడ్డందువల్ల కథలకు ఎక్కువ అందాన్ని చేకూరుస్తున్న వనుకోము. ఒకటి రెండు చోట్ల 'ప్రపంచకాన్ని', 'ప్రపంచకం' అని ఉపయోగింపబడ్డది. 'క' ప్రత్యయము అనవసరమేమో? "ఏంరా! రంగాచార్లు! మరచిపోయినా యక్స్యూజ్ మి. రంగా యం. ఎ. అనాల్సి గామాల్సి దానిదుంపతెగ! రానీ మొహానన్నా కట్టుకో రాదూ!" అని ఒకచోట,......"యాందండి! కిష్టయ్యగోరు? మీరు ఎప్పుడూ యింతేనండీ !!......" అని మరోచోట,...ఇల్లాగే కొన్ని సంభాషణలు, కథావస్తువుతో కలిసిరావడంలేదు.

నీలిరచన ఇంకా గాంభీర్యాన్ని, దానితో ప్రౌఢత్వాన్ని సంపాదించుకొని, మన సాహిత్యంలో హాస్యరసమునకుగల కొరతను తీర్చగలదని మా నమ్మకము.

—శా. న.

## కాంతం కైఫీయతు

మునిమాణిక్యం నరసింహారావు

యువకార్యాలయం: తెనాలి: ౮ అణాలు

మునిమాణిక్యం వారి రచనలతో పరిచయం లేని పత్రికా పాఠకులు ఎవ్వరూ ఉండరు. వారికథలు వాంఛించని పత్రికలే ఉండవు. వారికథలకున్న ఆదరము ఇంకెవ్వరికిలేదు.

ఏదో ఒకచిన్న సాంసారిక విషయం ఎత్తుకొని కాంతాన్ని కథానాయికగా ఉంచి లలితమైన భావాలతోను సున్నితమూలయిన హాస్యకల్పనలతోనూ హృదయంగమముగా ఉండేకథ ఈయన కల్పిస్తారు. ఈయన తానురచించిన అన్నికథలలోనూ రాణీసాహేబాగా చిత్రించినా, కోర్టులో ముద్దాయిగా చిత్రించినా, వాసవసజ్జగా చిత్రించినా, విప్రలబ్ధగా చిత్రించినా, కాంతం ఒక వ్యక్తే కాని వేరువేరు వ్యక్తులు కాదనే భావం స్పష్టమయ్యేటట్టు ఒకఅపూర్వ మయిన పాత్రసృష్టి చేశారు. గిరీశం, పార్వతీశం, నీలకంఠం, ఎంకి ఏలాంటి విశిష్టవ్యక్తులో మన నేటి సారస్వత ప్రపంచంలో అలాటి విశిష్ట వ్యక్తే కాంతంకూడాను. ఆమె పలికే పలుకులలోనూ చేసే చేతలలోనూ ఒక విశిష్టత ఉన్నది. ఎందరు ఎన్నివిధాల నరసింహారావుగారిని అనుకరించా లని ప్రయత్నించినా వారివ్వరి రచనలలోని వ్యక్తీకూడా కాంతంవంటిది కాదు. కాంతం కథ వ్రాయాలంటే మునిమాణిక్యంవారే వ్రాయాలి. మునిమాణిక్యంవారు వ్రాయాలంటే కాంతంకథే వ్రాయాలి.

ఈ వ్యక్తిచరిత్రలోని పది సరసమైన ఘట్టాలు ఈ గ్రంథములో కథకులు చిత్రించినారు. ఇందులో ఎక్కడా నీరసమయిన పట్టులుకాని ఔచిత్యము చెడిన స్థలాలుకాని అపహాస్యానికి పాలయిన వ్రాతలుకాని వెతికినా కానరావు. సంసారములో వుండే ఎండ వానలు—లేతఎండలూ చిరుజల్లులే—అవిచక్కగా చిత్రించి సంసారము అసారము అని భావించేవారికి తగినప్రతివచనము ఈకథలలోచెప్పి

నారు. ఈకథలు గ్రంథరూపంగా ప్రకటించి చవకగా అమ్ముతూవున్న యువకార్యాలయం వారిని అభినందిస్తున్నాము.

తె. శాం. ర.

## ఆ ధా ర ము లు

జనస్వామి కోదండరామశాస్త్రి

కథలసంపుటి : వెల 0-6-0

లక్ష్మీప్రెస్ : తెనాలి

పత్రికలలో ఇదివరకే ఈకథలన్నీ అచ్చుపడ్డవనీ, ఆంధ్రలోకము వీటిని చవి చూచిందనీ గ్రంథకర్త తొలిమాటగా తెలిపినాడు. కార్మికజనం పడుతున్న బాధలన్నీ ఈకథలు వర్ణిస్తున్నవనికూడ ఆయన అభిప్రాయం.

ప్రాచీనకాలంనుంచి మనదేశంలో ప్రజలు ఆయా కాలాల్ని అనుసరించి కథలు వ్రాస్తూండేవారు. వెనకటిరోజుల్లో ఆకర్షణీయమైన సమస్యలు, ఈరోజుల్లో అలాఉండవు. కొందరు గొప్పకథకులు తమసిద్ధాంతాలను కథామూలంగా ప్రకటించారు. లోకాన్ని కొంతవరకు బాగుచేయగలిగారు.

ఈకథకునికి ఏదో ఆదర్శాలున్నట్టుకొద్దిగా కనబడుతున్నది. కథకు రచనావిధానము చాలావన్నె తెస్తుందనే సంగతి ఈగ్రంథకర్త మరిచిపోయినట్టుంది. పుస్తకములో చాలాచోట్ల రచన పేలవంగా ఉన్నది. భాష ఎటూకాకుండా కలగం పులగంగాఉన్నది. హృదయంగమంగా కథచెప్పేపద్ధతి ఈయనకు ఇంకా అలవాటుకాలేదు.

“భవాని” అనేకథ చాలా పచ్చిగా ఉంది. భవానికి గ్రంథకర్త చూపించిన ముక్తిమార్గము ఏమీబాగాలేదు. “కన్నీటికెరటాలు”లో కథకుని ఉద్దేశ్యము వ్యక్తముకాలేదు. కిరణ, మురళి—ఇద్దరు కళాపిపాసువులట. ఇద్దరికీ కవిత్వం తెలుసు. ఒకరిమీద ఒకరికి ఇష్టం. ఆయన ఆవిడకోసరం పరితపించాడట. ఆవిడవితంతువుట. ఇన్నీ సమకూడినపుడు ఆవిడ బ్రహ్మచర్యదీక్ష పట్టిందట. ఎంతపిరికి! “దిక్కులేని బిడ్డ” మరీపచ్చిగాఉంది. “కార్మికరత్నం” కొంత నయం. “ఇదేనాన్యాయం” అనేకథ కొంతమార్పు చేస్తే బాగుండేది.

ఇక కథలమూలంగా లోకం ఎంతమాత్రం మరమత్తు అవుతుందని అనుకోం. కథలలో ఉన్నాశయాలకు తావిచ్చి రచనాశక్తిబాగా శుద్ధి అయిన మీదట ఈకథకుడు కథారచనకు దిగితే బాగుండేది. ఇవన్నీ కలిపి సంపుటిగా వేయకపూర్వం గ్రంథకర్త బాగా ఆలోచించి ఉండవలసినది.

రా.కు.

## న వ నా థ చ రి త్ర

గౌరనామాత్యవిరచితము. సంపాదకుడు

కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ.

ఆంధ్రోపన్యాసకుడు,

ప్రాచ్యపరిశోధన సంస్థ

మద్రాసు విశ్వవిద్యాలయము

వెల రూ 3—0—0

ఇది మద్రాసు విశ్వవిద్యాలయాంధ్రగ్రంథమాలలో ఏడవగ్రంథము రామకృష్ణయ్యగారు ఆంధ్రలోకానికి చిరపరిచితులు. వారు ఇంగ్లీషులో ఒకటి తెలుగులో ఒకటి—రెండు పీఠికలు దీనికి వ్రాసినారు.

హరిశ్చంద్ర ద్విపదవ్రాసిన గౌరన, నవనాథచరిత్ర వ్రాసిన గౌరన ఒక్కరనే ఊహించవచ్చును. కాని సందేహాలు లేకపోలేదు. సంపాదకులకు సందేహము తోచలేదు.

గౌరన తండ్రిపేరు ఎల్లమంత్రి అనా! ‘అయ్యలమంత్రి’ అనా? అ+ఎల్లమంత్రి అనే పదము మార్పులతో అయ్యలమంత్రి అని వ్రాతప్రతులలోకి వచ్చినదేమో! లేకపోతే హరిశ్చంద్రద్విపదలోనే తనతండ్రిపేరు ఒకచోట ఎల్లమంత్రి అనీ చివర అయ్యలమంత్రి అనీ చెప్పుకోవడం తటస్థిస్తుందా?

పీఠికలో ౧౫-౨౬ పేజీలకు 'కథారంగము ఆంధ్ర దేశ సంబంధము' అనే శీర్షికలో 'ఆంధ్రశబ్దచింతామణి' నన్నయభట్టు రచించినది కాదని సంపాదకులు నిరూపించినారు. నవనాథ చరిత్రలో సారంగధరకథ మహారాష్ట్రదేశమున జరిగినట్లు ఉన్న అవకాశము కల్పించుకొని ఆంధ్రశబ్దచింతామణి గ్రంథకర్తృత్వవిషయము ఇంత విపులముగా ఈ గ్రంథ పీఠికలో విమర్శించడము అప్రస్తుతంగా కనిపించినది.

పరిశోధకులైన సంపాదకులు పీఠికలో శివకవుల సంగతి విశేషముగా వర్ణించి అందులో గౌరనకు ఎట్టిస్థానమున్నదో వర్ణించినట్లయితే బాగుండేది. ఆ విషయము కొంచెముగా సూచించినారు కాని వివరించలేదు.

ఈ నవనాథచరిత్ర శ్రీగిరికవి వ్రాసిన ప్రబంధముకు ద్విపదానువాదము. మూలగ్రంథము లభించలేదు. హరిశ్చంద్రోపాఖ్యానమంత ప్రౌఢముగా ఈకృతి కనపడదు. దానినిబట్టి రెండూ వ్రాసినది ఒక్క గౌరనే అయితే ఇదిముందు వ్రాసినదని ఊహించవచ్చును.

ఇంత పెద్ద కావ్యము ప్రథమపర్యాయము పాఠభేదములతో ఈగ్రంథమాలవారు ముద్రించినారు. గ్రంథము ఫెదర్ వెయిటు కాగితములమీద చక్కగా ముద్రితమైనది. సంపాదకులు చేసిన చిన్నచిన్న మార్పుల తెలియడానికి కుండలీకరించినారు. ముఖ్యమైనపాఠాంతరములు క్రింద చూపినారు. మూలప్రతికలో ఎక్కువ లోపించిన చోట చుక్కలు పెట్టి వదిలిపెట్టినారు. ఈవిధంగా పురాతన గ్రంథాలు ముద్రిస్తే వ్రాతప్రతులు చూడని వారికి మూలగ్రంథ స్వరూపము ఊహించడానికి చక్కని అవకాశము కలుగుతుంది.

మొత్తము మీద ఈ గ్రంథము ముద్రించినందుకు మద్రాసు విశ్వవిద్యాలయము ప్రాచ్యపరిశోధన సంస్థనూ గ్రంథమాల సంపాదకులనూ అభినందిస్తున్నాము.

నో. న. శా.

## విజ్ఞానం సంపుటము ౧ సంచికలు ౧, ౨

రెండునెలలకొకసారి ప్రకటించే ప్రకృతి శాస్త్రసంబంధమైనపత్రిక

సంపాదకులు : కాళీపట్నపు కొండయ్య ఎమ్. ఎస్ సి.

కార్యస్థానము: రాజమహేంద్రవరము

సంవత్సరచందా రూ 4 లు.

విజ్ఞానవిషయాలు ఎంతకాలం పరాయిభాషలో బోధిస్తారో అంతకాలమూ అవి యూనివర్శిటీలు కళాశాలలు అనే గర్భగుడ్లు విడిచి బయటికిరాలేవు. విజ్ఞానబోధకై ఎంతో ద్రవ్యము ఖర్చవుతూఉన్నా దానివల్ల ఏ కొద్దిమందికి మాత్రమో లాభము కలుగుతూ ఉన్నదికాని దేశమంతా అజ్ఞానములోనే మునిగియున్నది. విజ్ఞానం దేశంలో విరివిగా వ్యాపించాలంటే మాతృభాషలో నేర్పడంముఖ్యావసరం. ఇంతేకాదు. విజ్ఞానచరిత్ర చదివితే ఇంకొకటి స్పష్టపడుతుంది. విద్యుద్దీపము, గ్రామఫోను మొదలయిన మిక్కిలి ఉపయోగకరములగు వస్తువులను కనిపెట్టిన ఎడిసన్ ఏకాలేజీలోనూ శిక్ష పొందలేదు. అతడు తన మాతృభాష అయిన ఇంగ్లీషులో ఉన్న గ్రంథాలు చదివి స్వయంకృషివల్ల నూతనవస్తు నిర్మాణశక్తి అలవరచుకొన్నాడు. ఇటువంటి నిదర్శనములు ఎన్నో ఉన్నవి. మన దేశములోకూడా ఎడిసన్ వంటివారు, ఫారడే వంటివారు తగిన అవకాశాలుంటే బయలుదేరకపోరు. విజ్ఞానమంతా పరభాషలో ఉండడంవల్ల ప్రజల బుద్ధిబలమూ, శక్తియుక్తులూ దేశాభ్యుదయానికి తోడ్పడే అవకాశం లభించక వ్యర్థమై పోతూ ఉన్నవి.

విజ్ఞానము తెలుగు దేశంలో వ్యాప్తి పొందాలంటే విజ్ఞానవిషయాలు బోధించే చక్కని తెలుగు పత్రికలు ముఖ్యావసరము. ఇంగ్లీషుభాషలో వెలువడే వైజ్ఞానిక పత్రికలసంఖ్య లెక్కించడము కష్టము.

మనభాషలో ఇంతవరకూ అట్టి పత్రిక ఒక్కటయినా లేదు. విజ్ఞానవిషయాలలో జనసామాన్యము ఎంత వెనుకబడి ఉన్నదో దీనివల్లనే తెలుస్తూ ఉన్నది.

ఇట్టి సందర్భములో శ్రీ కొండయ్యగారు ఈ పత్రిక ప్రకటించడంవల్ల ఈ లోటు కొంతవరకయినా తీరుతుందని ఆశపడుతున్నాము. ఆంధ్రంలో 'విశ్వరూపం' అనే ఉత్తమ గ్రంథం రచించి విజ్ఞాన రహస్యాలను అత్యంతాకర్షకంగా దేశభాషలో సుబోధంగా వ్రాసే సామర్థ్యమూ నేర్పూ చూపిన వీరు ఈ పత్రిక నిర్వహించడానికి పూనుకోవడం చాలా యుక్తంగా ఉన్నది. ఇంతవరకూ వెలువడ్డ రెండు సంచికలూచూస్తే వీరి సంపాదకత్వము క్రొంద క్రమమైన పద్ధతులను అనుసరించి ఆంధ్రలోకానికి బాగా ఉపయోగపడేటట్లు ఇది నడుస్తుందనే నమ్మకము కలుగుతూఉన్నది. ఈ సంచికలలోని వ్యాసాలు సుబోధంగా సుపరిచితమయిన భాషలో ఉన్నవి. సామాన్యజనులకు అవసరమైన విషయాలను గురించి ఉండడము వల్ల విజ్ఞాన విషయాలను గురించి తెలుసుకోవలెననే ఆసక్తి ప్రజలలో వ్యాపించడానికిఇవి తోడ్పడతవి. పత్రికలో చివర చేర్చిన నూతన విషయములు, సులభ యోగాలు వైజ్ఞానికశబ్దావళి పత్రికవిలువనుఇనుమడింప జేస్తున్నవి. అవసరమైన చోట్ల చేర్చిన పటములు విషయబోధకు అనుకూలపడుతున్నవి. దళసరి కాకితముల మీద ముద్రించి చక్కని బైండింగుతో పత్రిక చూడడానికి ఆకర్షకముగాఉండేటట్లు చేసినారు. ఉత్సాహ పూరితులూ, యువకులూ అయిన కొండయ్యగారు ఈపనికి పూనుకోవడం వారి దేశసేవా తత్పరతనూ, భాషాసేవా నిరతినీ తెలుపుతూ ఉన్నది.

ఈ రెండుసంచికలలోనూ ప్రకటితమైన 'చంద్రలోకయాత్ర' భూమిని చుట్టిఉండే వాతావరణస్థితినీ, చంద్రలోకవిషయాలనూ, ఇంకా అనేక వైజ్ఞానికములగు సంగతులునూ చాలాచక్కగా తెలియజేస్తున్నది. ఒక యాత్రికుని కల్పించి ఈవిధముగా విషయము బోధించడము చాలా ప్రశంసింపదగ్గ పద్ధతి. అయితే పత్రిక యథార్థవిషయబోధక మాట వల్ల జనసామాన్యానికి తెలిసే నిమిత్తం ఈయాత్రికుడు మాత్రం కల్పితపురుషుడని తెలియజేస్తే బాగుండేది. ఈరెండుసంచికలలోనూ భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, సిద్ధాంతశాస్త్రము, జీవశాస్త్రము, ఆహారశాస్త్రము మొదలయిన వివిధ శాస్త్రలకు సంబంధించిన విషయము లున్నవి. ప్రజల నిత్యోపయోగములో ఉన్న కిరసనాయిలు, గ్రామఫోను, కార్కు మొదలయిన వస్తువులనుగురించిన్నీ మన ఆహారముగురించిన్నీ, ('మనంతినేది అన్నమేనా' 'దక్షిణదేశంలోని ఆహారసమస్య', అనే వ్యాసములు) మానవజీవనానికి చిక్కులు కలిగించే సూక్ష్మజీవుల గురించిన్నీ చక్కని వ్యాసము లున్నవి.

విజ్ఞానవ్యాప్తికి సాధనభూతమైన ఈ 'విజ్ఞానం'అనే పత్రికను ఆదరించి సర్వవిధములా పోషించడం ఆంధ్రుల కర్తవ్యము. అజ్ఞానతిమిరమును పోగొట్టి 'విజ్ఞానం' ఆంధ్రదేశంలో విజ్ఞానద్యుతులను ప్రసరింప జేస్తుందని నమ్ముతున్నాము. దే. స. సు.

[ స్థలంచాలక క్రిందటి సంచికలో ఈ సమీక్ష ప్రకటింపలేక పోయినాము. — సంపాదకుడు ]

### వసంతము

### రసాంజలి

### శుభమస్తు

సహృదయుడు సారస్వతాభిలాషి అయిన శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావుగారి వివాహ సమయాన కవిమిత్రుల ఆశీఃపూర్వక ఉపహారం ఈ అమూల్య కావ్య గుచ్ఛం; ఈశ్వర వసంతంలో వికసించి వాసిస్తూన్నది.

వసంతము :

పెమ్మరాజు లక్ష్మీపతిగారి కృతి. "వసంతము కవికుమారుల యుపాస్యదేవత" అని కావ్య పరిచయ

వాక్యం; ఈ వసంతము కవితా కుమారికకు అలంకారం, అని మా ఉద్దేశం.

మధురమైన వసంతవేళ—
"ప్రియునీ సురపతినైన నే కాదుర చూచెద నీ"
కని ప్రవాసి ప్రియునికి చక్కని పలుకులతో లేఖ వ్రాస్తాడు—అదే ఇతివృత్తం.

"పూచిన పూలలో పురుడుపోసిన పిందెలు"
కొందరైన చక్కని భావాలు ఇందులో ఉన్నాయి.

"నూతన యుగోదయ గీతిక లాలపించెదన్"
అన్నవీరి నూతన గీతాలు ఎప్పటికో!

## రసాంజలి :

"కడలి తరగల కెల్ల సైకతము వోలె
నా కవితకు త్వత్పాద పంకజము అవధి"

అని నతి చేస్తూ శిష్యశ్రేణి అద్దేపల్లి వారికి 'భక్తి ప్రీతులతో' అంజలి ఇచ్చారు.

'రహస్సుధ'లో పద్యాలు సెంకితనంగా నడచాయి.

"నేను నీలో చిరదీప్తినై తళుకులన్ విరజిమ్మ"
అన్న కవి ఎప్పటికైనా వెలుగులు చిలికించాడు.

## శుభమస్తు :

పేరెక్కిన కవులు చాలమంది అందమైన కావ్యాలుగా నాగగోపాలరావుగారి పెళ్లికి ఆశీస్సులు పలికారు.

కావ్యాలన్నీ సొగసుగా అచ్చై వెలువడ్డాయి. అంతేల సుబ్బారావుగారి చిత్రాలు వాటికి ఎక్కువ శోభ చేకూర్చాయి.

కవిగాను, కావ్యప్రోత్సాహకుడుగాను అనేక విధాల భాషాసేవ చేస్తూన్న కృతిభర్తని
"అలికి మధు పూర్ణమగు విరియబ్బెనను
పాట చాలింపకోయి గోపాలరాయ"
అని మేముకూడా హెచ్చరిస్తున్నాము.

ఈ నూత్న దంపతుల ప్రణయజీవనం మధురకావ్యం కావాలని మా ఆశయం, ఆశీస్సు.

శ్రీ. రా.